17.9.1993 శుక్రవారం 12 పేజీలు, సంపుటి: 64, సంచిక: 38, విడిప్రతి రు. 2.00 లు

Regd. No. HNL. 18

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు, జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

## వైఎస్ సైన్యంలో తిరుగుబాటు?

ఉరుమురిమి మంగళం మీద పడినట్లు రాష్ట్ర మంత్రివర్గ విస్తరణలోని అసంతృప్తి జ్వాలలు డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి సైన్యాన్ని కలిచివేస్తున్నాయి. రాష్ట్ర కాంగ్రెస్‌లో ఒక ప్రబలమైన శక్తిగా రూపొందిన రాజశేఖర రెడ్డికి బలమైన అనుచర వర్గముంది. ఆయన దగ్గరకు చేరిన వారు సాధారణంగా ఆయన్ను వదిలిపోరు. హార్డ్‌కోర్ మిలిటెంట్ల మాదిరి ఆయన్ను అంటి పెట్టుకొని వుంటారు. ఎందువల్లనో కాపు నాయకుల్లో వైఎస్‌కు అనుచర వర్గం అధికం- వంగవీటి మోహన రంగా ప్రభావం కావచ్చు. రంగాను వీధి స్థాయినుంచి, విజయవాడ స్థాయికి పెంచి, టిక్కెట్టిచ్చి, ఎమ్మెల్యే చేసింది రాజశేఖర రెడ్డే! కర్నూలు జిల్లా ముఠా రాజకీయాలలో విజయ భాస్కరరెడ్డి నుంచి రక్షణ కోరుతూ దగ్గరైన కె.ఇ. కృష్ణమూర్తి ద్వారా కూడా కొంత బిసి నాయకులతో వైఎస్‌కు సాన్నిహిత్యం పెరిగింది. చెన్నారెడ్డిపై యుద్ధం ప్రకటించినప్పుడు కాని, జనార్ధనరెడ్డి పై పోరాటం చేసినప్పుడు కాని, ఆ తర్వాత విజయభాస్కరరెడ్డికి పొగబెట్టి పొరర బెట్టడంలో కాని ఈ అనుచరులందరూ ఆయన గీసిన గిరి దాటకుండా ప్రవర్తించారు. అటువంటి అతివిధేయులలో తాజా మంత్రి వర్గ విస్తరణ చీలిక తేవడం, తిరుగుబాటును ప్రేరేపించడం విచిత్రం.

వైఎస్ వీరానుచరుడిగా పేరున్న శ్రీ ముద్రగడ పద్మనాభం తిరుగుబాటుకు తొలిగా సిగ్నల్ చూపారు. తన జిల్లాలో బద్ధవిరోధి అయిన పంతం పద్మనాభం తన వచ్చి తనతో చేతులు కలిపాడన్న ఆనందంతో స్వయం విధిత అజ్ఞాత వాసం వీడి హైదరాబాదుకు వచ్చిన ముద్రగడ వైఎస్‌ను కలవలేదు.

కొరవ 8 పేజీలో



పూలదండల మార్పిడిలోనే కొత్త భార్యను ఎంత ఆర్తిగా స్పృశిస్తూ, మైమరుస్తున్నాడో చూడండి ముసలి పెండ్లి కొడుకు

### కోట్లను ఏడ్పిస్తున్నారు ఎమ్మెల్యేలు

## కోపం నటిస్తే కార్పొరేషన్?

ముఖ్యమంత్రి పై రోజా కొరకు అలగడం, వారిని బుజ్జగించడం మామూలై పోయింది. మంత్రులు మైసూరా రెడ్డి, రామిరెడ్డి బుజ్జగింపుల్లో ప్రధాన పాత్ర వహిస్తున్నారు. ముఖ్యమంత్రి మీద కష్టంగా వున్న వారి దగ్గరకు వెళ్లడం, వారిని బుజ్జగించి ముఖ్యమంత్రి వద్దకు తీసుకు వెళ్లడం, ముఖ్యమంత్రితో మాట్లాడి వెళ్లాక వారి పై నిఘా వుంచడం వంటి పనులన్నీ ఈ మంత్రులు తమ భుజాల పై వేసుకున్నారు. నువ్వు కొంత కాలం ఆగు; లేక పోతే నీకేం కావాలో చెప్పు. పెద్ద కార్పొరేషన్ ఏదైనా కావాలంటే తీసుకో అంటూ ముఖ్యమంత్రి బుజ్జగిస్తున్నారట. ముఖ్యమంత్రి బలహీనతను ఆసరాగా చేసుకొని పార్టీలో ప్రతి ఒక్కరూ అసమ్మతి వాదిలాగా మారి విజృంభించేస్తున్నారు. ఎమ్పి వి.హనుమంత రావు ఒక పక్క వెనుక బడిన తరగతులకు అన్యాయం జరిగిందంటూ ఆగం చేస్తుండగా, మాజీమంత్రి చిత్తరంజన్ దాస్ కూడా దీనికి తాళం వేస్తున్నారు. మాజీ ఎంఎల్‌సి కేశవ రావు దీనికి ఆజ్యం పోస్తున్నాడు. పిసిసి అధ్యక్షుడు తులసీ దాస్ అప్పుడప్పుడు సిఎం పై విమర్శలు చేస్తూ అసమ్మతి కుంపటిని ఆరకుండా చేస్తున్నాడు. మంత్రి వర్గ విస్తరణ తర్వాత కాపుకులంలో కలకలం రేగింది. పెద్ద కాపుల్ని కాదని చిన్న కాపుల్ని, అంతగా ప్రాధాన్యం లేని వారిని దగ్గరకు తీయడంతో కలవరం మొదలైంది. మాజీమంత్రి గుర్నాథ రావు ఉత్తరాంధ్రలో డైనమిక్ కాగా, ద్రోణం రాజు ఒత్తిడికి లొంగి ముఖ్యమంత్రి వృద్ధుడైన సత్యారావుకు మంత్రి పదవి ఇచ్చారు. దానితో గుర్నాథ రావు ఉత్తరాంధ్రలో కుంపటి రాజేస్తున్నారు. కృష్ణా జిల్లాలో కాపుల్ని కాదని మైనారిటీ బేగ్‌కు మంత్రి పదవి

కొరవ 8 పేజీలో

### జనం ఛీత్కరిస్తుంటే, దేశం నాయకులు జేజేలు కొడుతున్నారు

# తెలుగుదేశం ప్రతిష్టకు సమాధి!

ఎన్టీఆర్ ఒకింటి వాడైనాడు; నిన్నటి వరకు ఒంటరిగా వుండినవాడు కొత్త నేడు జంటగా మారాడు. 'ఎన్టీఆర్ దంపతులు' ఇప్పుడు జూబిలీ హిల్స్‌లోని ఆధునిక భవంతిలో అధికారికంగా కాపురం ప్రారంభించారు. దీనిలో అనధికారికంగా కలసి వుండి, అక్రమ సంబంధపు ప్రచారంతో రోత పట్టే పరిస్థితి తప్పింది. చిలకా గోరింకల లాగా, కాకి దొండపండుల లాగా సంసారం నడుపుకోవచ్చు.

డెబ్బయి యేళ్ల వయస్సులో, గుండెపోట్లు, బైపాస్ సర్జరి, పక్షవాతం వంటి రోగాలకు గురైన పరిస్థితిలో ఎన్టీఆర్ మళ్లీ పెళ్లాడడం, దానికి విస్తృత ప్రచారం కల్పించడం ఎన్టీఆర్ జీవనశైలికి అద్దం పట్టింది. తిరుపతి సభలో, లక్షమంది జనం ఎదుట లక్ష్మీపార్వతిని వేదిక పైకి పిల్చి, 'నిన్ను పెళ్లాడుతా' అని చెప్పగల్గడంటే ఆయన ధైర్యానికి మెచ్చుకోవాలి. ఈ ఆవేశం, ఈ నైతిక పతనపు నిర్ణయంతో తెలుగు దేశం నాయకుల దిమ్మ తిరిగిపోయింది. దాదాపు ఏడాది కాలం నుంచి ఎన్టీఆర్, లక్ష్మీపార్వతిల అక్రమ సంబంధం పట్ల చంద్రబాబు నాయుడు, ఇతర కుటుంబ సభ్యులు అభ్యంతరం చెప్తూనే వున్నారు కాని ఎన్టీఆర్ విన్పించుకోలేదు. పార్వతిని తీసుకెళ్ళి దాచిపెడితే నైనా ఈ ముసలి పీనుగ కామావేశం తగ్గుతుందని భావించి, ఆమెను దాచి పెడితే, నిరాహారదీక్ష చేసి, ఇల్లంతా చిందర వందర చేసి, చంద్రబాబు నాయుడి



తిట్టిపోసి, అతడిపై అక్రమ సంబంధాల నింద వేసి తిరిగి వెనక్కు రప్పించు కున్నారామెను. ఆమెను పెళ్ళిచేసుకోవాలనే ఆలోచన ఆరునెలల క్రితమే వచ్చిందట. అయితే ఎటూ ఇంట్లోనే "వుంచు"కొని వున్నావు కాబట్టి మళ్లీ పెళ్ళి పెటాకులని మా ప్రాణం తోడబాకు అన్నారట కుటుంబ సభ్యులు. కాని ఆయన విన్పించుకోలేదు. ఆమెతో అరక్షణం ఎడబాటు సహించలేక అమెరికాకు కూడా తన వెంట తీసుకెళ్ళారట. జిల్లా పర్యటనలకూ తనతో రమ్మన్నాడట. ముసలి ప్రణయం మరీ మితిమీరి పోతుండడంతో కుటుంబ సభ్యులు అలిగి ఇంటికి రావడమే మానివేశారు. తాళి అనేది కట్టేస్తే తప్ప పార్వతికి భద్రత ఏర్పడదనే, ఆస్తిపాస్తులు ఆమెకు చెందకుండా పోతాయనే భయంతో ఎన్టీఆర్ పెళ్లితలపెట్టాడు. తిరుపతిలో ఈ ప్రస్తావన వస్తే చంద్రబాబు, మోహన్‌బాబు తదితరులు ప్రతిఘటించారు. ఇక వీరు మాటవినరనే తెగింపుతో, ఎన్టీఆర్ బహిరంగ సభలో ఆ ప్రకటన చేసేశారు. ఇటు వేదిక మీద వున్న వారికి, అటు క్రింద వున్న జనానికి షాక్ తగిలినట్లుండింది ఆ ప్రకటన. తిరుపతి నుంచి వచ్చి రాగానే మొదట దండలు మార్చుకొని పెళ్లి చేసుకున్నారు; తర్వాత రిజిస్టరు పెళ్ళి చట్టబద్ధత కల్పించారు. రిజిస్ట్రార్ పెళ్లు ఎప్పుడనుకుంటె

కొరవ 7 పేజీలో

ప్రతి భారతీయుడి ఛాతీ గర్వంతో ఉప్పొంగుతుంది!

# రోదసిలో రెపరెప లాడనున్న కీర్తిపతాక!

భారతీయ కీర్తి పతాకను సమున్నత రోదసిలో, సగర్వంగా ఎగురవేయ గల్గిన పిఎస్ఎల్వి రాకెట్ ప్రయోగానికి సిద్ధంగా వుంది. రేపో, మాపో నిప్పుల ఆకాశానికి దూసుక పోనున్నది. పిఎస్ఎల్వి అంటే పోలార్ సెటిలైట్ లాంచ్ వెహికల్; జియో సింక్రోనస్ సెటిలాంచ్ వెహికల్‌కు ఒకే ఒక మెట్టు దిగువ వుండే రోదసీ నౌక ఇది. 275 టన్నుల బరువు, పదిహేనంతస్తుల (145.2 అడుగులు) ఎత్తు కల్గిన రాకెట్ ఇది. పూర్తి స్వదేశీ పరిజ్ఞానంతో నిర్మించారు దీన్ని. ఇందులో విశేషం – రాకెట్ ప్రయాణ దిశలో రెండు దశలలో ద్రవరూప ఇంధనం వాడడం. ద్రవరూప ఇంధనం అంతరిక్ష శాస్త్ర పరిజ్ఞానంలో అత్యంతాధునిక టెక్నాలజీ.

పిఎస్ఎల్వి రాకెట్, భూమి నుంచి 870 కిలోల బరువున్న రిమోట్ సెన్సింగ్ ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి తీసుక వెళ్లి, భూమికి 400 కిలో మీటర్ల దూరంలో నిలబెట్టబోతున్నది. రాకెట్‌ల ద్వారా ఇంత సైజు ఉపగ్రహాలను రోదసిలోకి పంపగల్గే పరిజ్ఞానం కల్గిన దేశాలు ఐదారు మించి లేవు. వాటి సరసన భారతదేశాన్ని సగర్వంగా నిల్ప గల్గుతున్నారు మన శాస్త్రవేత్తలు. ఈ ప్రాజెక్టును తలపెట్టింది 1980 లో. అంతకు క్రితమే 1973 ప్రాంతంలో

> పిఎస్ఎల్వి రాకెట్
> ప్రయోగం
> విజయవంతమైతే
> అంతరిక్షం మన
> అదుపులోకి
> వచ్చేస్తుంది!

ఇటువంటి ప్రతిపాదన పరిశీలనకు వచ్చింది. భూమి కక్షకు దగ్గరగా ప్రవేశ పెట్టే ఇటువంటి చిన్న చిన్న ఉపగ్రహాలను టెలి కమ్యూనికేషన్లు, భూమి ఖనిజాలు, వాతావరణం వంటి వాటి పై సర్వేలకు వాడుతారు. భారతదేశం ఇది వరకే ఎస్ఎల్వి -3, ఎఎస్ఎల్వి రాకెట్లు విజయవంతంగా ప్రయోగించినా, పిఎస్ఎల్వివి ప్రయోగించడం ఇదే ప్రథమం. ప్రధాన దశలో దాదాపు పది అడుగుల వ్యాసం కల్గిన ప్రథమ మోటారు, మూడున్నర అడుగుల వ్యాసం కల్గిన స్ట్రాప్ ఆన్ మోటార్లు ఆరు పిఎస్ఎల్వి రాకెట్‌ను ఎగురవేస్తాయి. ఇందుకోసం 125 టన్నుల ఘన ఇంధనం ఖర్చు అవుతుంది. రెండవ దశలో, ఒక ట్యాంకులో నిలువ చేసిన 37.5 టన్నుల ఘన ఇంధనం వుండి రాకెట్‌ను పైకి పంపుతుంది. ఈ దశలో పూర్తి స్వదేశీ పరిజ్ఞానంతో రూపొందించిన వికాస్ ఇంజన్ పనిచేస్తుంది. ఇది పనిచేసేది కేవలం 150 సెకండ్లు. కాని ఆ కనురెప్ప పాటులోనే రాకెట్‌ను మొదటి దశలోని 56 కిలో మీటర్ల ఎత్తు నుంచి 243 కిలో మీటర్ల అంతరిక్షానికి ఎగురవేస్తుంది. మూడవ, నాలుగవ దశలలో ద్రవరూప ఇంధనం రాకెట్‌ను నడిపిస్తుంది. నాలుగవ దశలో



నిప్పులు చిమ్ముకుంటూ నింగికెగయడానికి సిద్ధంగా వున్న పిఎస్ఎల్వి రాకెట్

అమర్చిన నావిగేషన్ సిస్టం రాకెట్‌లోని ఉపగ్రహాన్ని కక్ష్యలో ప్రవేశ పెడుతుంది.

పిఎస్ఎల్వి రాకెట్ మొత్తం ప్రయాణ సమయం వెయ్యి సెకండ్లు. ఈ స్వల్ప సమయంలోనే అందులో అమర్చిన కంప్యూటర్లు దాదాపు వంద కోట్ల (వెయ్యి మిలియన్లు) అంశాలను సమాచార రూపంలో క్రోడీకరించి, భూమి మీద వుండే ప్రధాన కంప్యూటర్లకు చేరవేస్తాయి. దురదృష్టవశాత్తు రాకెట్ విఫలమైనా ఈ సమాచారంతో లోపం కనుగొని భవిష్యత్‌లో నివారించు కోవచ్చు. దేశంలో వివిధ ప్రాంతాలలో అమర్చిన రాడార్లు రాకెట్ ఫైరింగ్ ప్రారంభమైన క్షణం నుంచి దాని ప్రయాణాన్ని నిశితంగా పరిశీలించి, రికార్డు చేస్తాయి. పొరపాటున రాకెట్ ప్రక్కదారి పడితే, కంప్యూటర్ హెచ్చరికతో దాన్ని సరిచేసుకునే వీలుంటుంది. చివరి దశలో పిఎస్ఎల్వి రాకెట్ గంటకు 27 వేల కిలో మీటర్ల స్పీడుతో ప్రయాణిస్తుంది. (కొరవ 11 వ పేజీలో)





# జమీన్‌రైతు

## ప్రమాదానికి సూచన

కేరళలోని ఒట్టపాళెం లోక్‌సభా స్థానంలో కాంగ్రెస్ ఘోర పరాజయం భారత రాజకీయాలలో రానున్న ప్రమాదానికి సూచనగా భావించాలి. ఒట్టపాళెం మొదటి నుంచి కాంగ్రెస్‌కు కంచుకోట. ఎప్పుడూ గెలుపు కాంగ్రెస్‌దే. ప్రస్తుత ఉపరాష్ట్రపతి కెఆర్ నారాయణన్ ఈ స్థానం నుంచి మూడు సార్లు గెలుపొందారు. ఆయన రాజీనామాతోనే ఉప ఎన్నిక అవసరమైంది. పూరకే ఓడిపోవడం కాదు - లక్షా 13 వేల ఓట్ల అవమానకర తేడాతో పరాజయం పాలైంది కాంగ్రెస్. సిపిఎం అభ్యర్థి కొత్త వారైనా వారికక్కడ చెప్పుకో దగిన కార్యకర్తల బలం లేకపోయినా ఇంత తేడా రావడం ఆశ్చర్యకరం. మోకాలి మీద కొడితే మూతి పళ్లు రాలినట్లు ఎక్కడో అయోధ్యలో కూలిన మసీదు ఇక్కడ కాంగ్రెస్ కొంప ముంచిదన్నది నిజం.

ఒట్టపాళెంలో ముస్లిం ఓటర్లది మెజారిటీ. వారు ఏక మొత్తంగా కూడబలుకున్నట్లు కాంగ్రెస్‌కు వ్యతిరేకం చేశారు. అయోధ్య పరిణామాలు ముస్లింల మనోభావాలను దెబ్బ తీశాయనడానికి రుజువిది. బాబ్రీ మసీదును దేశంలో తమ సామాజిక భద్రతకు సంకేతంగా భావించారు ముస్లింలు. దాన్ని కూలగొడుతుంటే పివి ప్రభుత్వం చూస్తూ వూరకున్నదన్న ఆగ్రహం వారిలో ఉతకుత వుడుకుతున్నది. అది వారి మనోభావాలను అమితంగా దెబ్బతీసింది; వారిలో అవిశ్వాసం పెంచింది. అందుకే వారు కాంగ్రెస్‌ను ద్వేషిస్తున్నారు. పోలింగ్‌లో ఆ కోపం ప్రదర్శించారు. రెండు నెలల లోపల నాలుగు కీలకమైన ఉత్తరాది రాష్ట్రాలలో అసెంబ్లీ ఎన్నికలు జరుగ నున్నప్పుడు ముస్లింలు ఇటువంటి వైఖరి నవలంబించడం ఎంత ప్రమాదకరమో చెప్పనవసరం లేదు. ఒక్క కేరళలోనే కాదు, పశ్చిమ బెంగాల్‌లోని చౌరంఘీ అసెంబ్లీ నియోజక వర్గంలోనూ అదే జరిగింది. అక్కడా ముస్లింలు కాంగ్రెస్‌ను వ్యతిరేకించి ఓడించారు. భిన్న ప్రాంతాలు, భిన్న రాష్ట్రాలలో జరిగిన రెండు ఎన్నికలలో భారతీయ ముస్లింలు ఒకే ఆలోచనా ధోరణిలో ప్రవర్తించడం గమనార్హం.

ఇంకా విచిత్రమేమిటంటే హిందువులు కూడా కాంగ్రెస్‌కు దూరమౌతున్నారు. నిన్న మొన్నటి వరకు పేరు చెప్తే మంచి నీళ్లు పుట్టని పశ్చిమ బెంగాల్‌లో బిజెపికి ఓట్లు పడ్డాయంటే, కేవలం మత పరమైన మూఢత్వంగానే పరిగణించాలి. హిందూ మతాన్ని, హిందువులను రక్షించ గల్గిన వారు, పెంచి పోషించ గల్గిన వారు బిజెపి నాయకులేనన్న మూర్ఖ దురభిప్రాయం హిందువులలో ప్రబలుతున్నది. కాంగ్రెస్ పార్టీ ఓట్ల దృష్టితో మైనారిటీలను ప్రత్యేక శ్రద్ధతో లాలించి, తమను నిర్లక్ష్యం చేస్తుందన్న దురదృష్టకరమైన అపోహ వారిలో ఏర్పడుతున్నది.

రెండు మతాలకు చెందిన ప్రజల విశ్వాసాన్ని కోల్పోవడం కాంగ్రెస్ చేసుకున్న స్వయం కృతాపరాధం. బిజెపి నాయకులను అతిగా నమ్మి, వారు చేసిన అబద్ధపు వాగ్దానాలను విశ్వసించి పివి నరసింహా రావు అయోధ్య విషయంలో వేసిన తప్పటడుగులు ఈ దుస్థితికి దారి తీశాయి. అయోధ్యలో ఆలయం, మసీదులు రెండింటినీ పునర్నిర్మిస్తామని ఆయన చెప్పే మాటలు ప్రజలు నమ్మడం లేదు. మైనారిటీల సంక్షేమం కోసం వేల కోట్ల పథకాలు ప్రకటించినా ముస్లింలు మారడం లేదు.

ఈ పరిణామాలన్నీ చూస్తుంటే భయమేస్తున్నది. తరతరాల చరిత్రలో సహోదరుల వలె బ్రతికిన హిందూ ముస్లింల ఐక్యతకు, సహజీవనానికి, మత సామరస్యానికి, లౌకిక తత్వానికి చేటు తెచ్చే బిజెపి వంటి మతోన్మాద వాదుల చేతుల్లోకి దేశం జారిపోతుందేమో నన్న భీతి కల్గుతున్నది. ఒట్టపాళెం ఉప ఎన్నిక ఈ ప్రమాదానికి సూచికగా కన్పిస్తున్నది. పివి ప్రభుత్వము, కాంగ్రెస్ పార్టీ ఇక ఏ మాత్రం ఆలస్యం చేసినా, నాన్చుడు వైఖరి అవలంబించినా పరిస్థితులు చెయిదాటి పోతాయి. కాంగ్రెస్ ప్రజలకు దూరమై పోతుంది. తక్షణం మేలుకొని, రెండు మతాల ప్రజలకు వాస్తవాలు వివరించి, రాజకీయాలను మత దృష్టితో అవలోకిస్తే వచ్చే దుష్ఫలితాలను విడమరచి చెప్పి, వారిలో విశ్వాసం పాదుకొల్పే చర్యలు చేపట్టాలి. ఒక్క క్షణం ఆలస్యం లేకుండా ఆలోచన జరగాలి.

దేశం ఇప్పుడున్న పరిస్థితులలో కాంగ్రెస్‌ను అధికారం నుంచి దించి వేస్తే జరగబోయేది వినాశనమే. ఆర్థికంగా దివాలా స్థితిలో వున్న దేశాన్ని సుసంపన్నం చేయడానికి పివి ప్రభుత్వం చేపట్టిన ఆర్థిక సంస్కరణలు దెబ్బ తిని పోతాయి. దాని వల్ల జరిగే నష్టమూ ప్రజలదే. మైనారిటీలు విశాల దృక్పథంతో ఆత్మ పరిశీలన చేసుకొని, ఆవేశం విడనాడి తాము చేస్తున్న తప్పును గ్రహించాలి. కాంగ్రెస్‌ను పట్టుబట్టి, పగబూని ఓడిస్తే వారికి రక్షణ కల్పించి, ఆత్మీయంగా చూసే పార్టీ ఇంకెక్కడ దొరుకుతుంది?

## జమీన్‌రైతు

17.9.1943

4 పేజీలు 0-1-6 అణా:

### వెంకటగిరి రాజ్యంలో

వెనక రూ. 700 లకు అమ్ముతుండిన భూమి నేడు 7 గొర్రెలకు ధారబోశాడు.

"తూమెడు రూపాయలు సంపాయించ వచ్చు. గాని, తూపిలి చెర్వు క్రింద భూమి సంపాయించలేము" అనే సామెత వుండింది పూర్వం. ఇప్పుడు ఆ ఓటి చెర్వు క్రింద భూములంటే ఉప్పునీళ్లకు దారబోసే దినాలొచ్చాయి.

ఈ మధ్య మల్లాపు శివరామయ్య శెట్టి అనే రైతు తూపిలి చెరువు క్రింద వున్న తన యకరా భూమిని 7 గొర్రె పిల్లలకు ధారబోశాడు. ఒక సాహెబ్‌కు, రామః రామః చివర శెట్టి గతి ప్రాప్తించిందిరా దేముడా!

- ఒక రైతు

### నెల్లూరు ముచ్చట్లు

- విమర్శకుడు

27 తేది జిల్లా బోర్డు మీటింగు. శ్రీ రేబాల సుమిత్రాదేవి గారి సభ్యత్వ పునరుద్ధరణ, కోవూరు పంచాయతీ బోర్డు ఎత్తివేయుట, బురదగాలి కొత్త పాళెం, వాకాడు, పడమటి కంభాలపాడు, పాఠశాలలను పీకివేయుట, నాటి కార్యక్రమ విశేషాలు.-

నెల్లూరు మున్సిపల్ మీటింగ్‌లో లక్కీబోర్డు అప్పీలు 13తేది చర్చకు వచ్చింది. లక్కీబోర్డు వుండడం ప్రజలకు శ్రేయస్సు అనేవారు 4 గురు. అక్కర లేదన్నవారు 12మంది. న్యూట్రల్ (అటు ఇటు చేరనిరకం) యిద్దరు.

లక్కీ బోర్డు కావాలన్న ఆ నలుగురు ప్రబుద్ధులు ఎవరయా అంటే (1) పూర్వాచార పరాయణ అష్టగాల పట్టాభిరామయ్య, (2) ఆర్యవైశ్య కులోద్ధారక ముసలి ప్రత్తి శ్రీరాములు చెట్టి, చర్మకార గాలంగార మాదిగ పోలయ్య, అఖిల విశ్వ స్త్రీ స్వాతంత్ర విజ్ఞాన ప్రదాత-డాక్టర్ మహాదేవన్‌గారి భార్య-ఆచార్య మామిడి పూడి వెంకటరంగయ్య గారి తనయ అయినటువంటి అల్లాడి అన్నపూర్ణమ్మ గారలు. న్యూట్రల్-మహబూబ్‌ఖాన్ సాహెబ్, చేర్మెన్ లక్ష్మయ్య గారలు. చేర్మెన్ న్యూట్రల్ అంటే కారణం మొగమాటమా? లేక లక్కీబోర్డు మంచిదా, చెడ్డదా, అనే విమర్శనాజ్ఞానం గూడా లేకనా అని ప్రజలు జంటుగా ప్రశ్నిస్తారు.

### 50 ఏళ్ళ క్రితం ఈవారం

కలెక్టరు జే దొర 11 తేది వచ్చి అప్పుడే చార్జి తీసుకొన్నారు. పినాయిగారు కోయంబత్తూరు కలెక్టరుగా వెళ్లిరి.

***

పాటూరి సుబ్బరామయ్య కేసు 13తేది చాలా భాగం ప్రాసిక్యూషన్ సాక్ష్యమయింది. కొరవ 20 తేది.

***

సిటీ సినిమాలు:- వినాయకలో - తమిళ ఆర్యమాల, కలెక్షన్ జోరుగావుంది. కళా కాంతులెట్లున్నా పామర జన రంజకంగా వుందని గోవింద నాయరంటాడు.

***

కొత్తహాల్లో:- గోలీబార్ అనే హిందీ పిక్చరు ఆడుతున్నది.

***

### గ్రామసీమలు

#### వాకాటి పారుడల

నెల్లిపూడి వారి కష్టాలు:- వాకాటిచెర్వు పారుదల చివరన పెచ్చురేటు పక్కనూగాని భూములున్నవి మాకు. వాకాటి రైతులు మాత్రం, ఆయకట్టులో చేరని తీర్వజాస్తి భూములకు గూడా తుష్టిగా, పారించుకునే దిన్ని, మా భూములకు మాత్రం మామేటీదారు వుచ్చారు బలరామి రెడ్డి పారనివ్వ కుండా గోదు గోదు మనిపిస్తుంటే చెప్పుకున్నా గ్రామపెద్దలు వినిపించుకోకుండా ఉదాసీనంగా ఉండి పొయ్యేదిన్నీ జరుగుతున్నది. మాబాధలు ఏవిధంగా తీరాలిరా దేముడా!

-నెల్లిపూడి రైతు

#### బాలి రెడ్డిపాళెం

దరిద్రదేవత అహర్నిశం, అంటే - రాత్రి పగలు స్థిరనివాసం ఏర్పరచుకొని కదలకుండా పీటాసనం యేసికూర్చొన్న యీ తూపిలి పరగణాలో కంచెల శిస్తులకే కళ్ల నీళ్లుకారుతుంటే, మామూళ్లెక్కడ నుండి తెమ్మంటారయ్య.

- రెంటూర్.

#### గూడూరు

1942 నుండి బాయింటు మైకా పర్చేజింగ్ మిషన్ తరపున మైకా యగ్జామినరుగ వుండిన టరనబుల్ గారు గత 31 తేది ఏసుక్రీస్తు సాన్నిధ్య మలంకరించెను. వీరి అనంతరం దస్తు మైకా వందల పెట్టెలు వెనక్కొస్తున్నవి. ఇట్లయితే చిత్రకార్తెలో బుట్టిన కంపినీలెన్నో దివాలా దీయవలసి వుంటుంది. స్మాల్ మైకామైనులెన్నో పని నిలపవలసి వుంటుంది. మిషన్ విధి ఏలానడుస్తుందో ముందు?

- ఓ.వి.

# ఎన్టీఆర్ దగ్గరకు భార్యలను తీసుక వెళ్లవద్దు!

సర్వసంగ పరిత్యాగినని ప్రకటించుకొన్న ఎన్టీ రామారావు గారు తనను దైవ సమానుడుగా భావించిన వీరగంధం సుబ్బారావు భార్యను అతడి నుండి వేరు చేసి వివాహం చేసుకోవడంతో ఎన్టీఆర్‌కు మహిళల పై వున్న గౌరవం ఎటువంటిదో బయట పడింది. లక్ష్మీ పార్వతి తనకు సేవలు చేసినందుకే వివాహం చేసుకొన్నట్లు చెప్పడంలో ఏ మాత్రం నిజాయితీ కనపడడం లేదు. ఎన్టీఆర్‌కు బాగోలేక పోతే సేవలు చేయాల్సిన బాధ్యత కల్గిన కొడుకులు, కోడళ్లు ఎందుకు దూరమయ్యారు; అందులోని లొసుగులేమిటి? అదిగాక అన్నగారు లక్ష్మి పార్వతిని ఒక కూతురుగానో, కోడలిగానో దత్తత తీసుకుని వుంటే ఆడపడుచు లందరూ ఆనంద పడేవారు. లేకుంటే మరెవరైనా పెళ్లికాని కన్యను చేసుకొన్నా సంతోష పడేవారు. భర్త నుండి వేరు చేసి పెళ్లి చేసుకోవడం అసహ్యంగా వుందన్న ఎన్టీఆర్ కుటుంబ సభ్యుల ఆవేదనకు అర్థం వుంది. అయినా ఎన్టీఆర్‌కు ఈ వయస్సులో పెళ్లేమిటి? ఇక నుండి ఎన్టీఆర్ ఆశీర్వచనం కోసం భార్యలను తమతో పాటు తీసుకెళ్లే భర్తలు ఇక నుండి జాగ్రత్తగా వుండాలండి!

నెల్లూరు —పందిళ్లపల్లి అరుణ

## జనవాణి

### అన్నకు అభినందనలు

ఎన్టీరామారావు గారు లక్ష్మి పార్వతిని వివాహం చేసుకోవడం అభినందనీయం. అన్నగారి గుండె ధైర్యం ఎంత మందికి వుంది. తనను అభిమానించే లక్షల మంది ప్రజల ముందు తన మనసులో మాట చెప్పి నిజాయితీని నిరూపించు కొన్నారు. రాజకీయ జీవితం వేరు - వ్యక్తిగత జీవితం వేరు. ఇల్లాలు లేని జీవితం నిస్సారం. జీవిత చరమ దశలో మరీ అవసరం. చాటు మాటు వ్యవహారాలు నిర్వర్తించే నేటి ప్రతి నాయకుడి చరిత్రా ప్రజలకు తెలుసు. స్వార్థంతో అన్న పై ఆరోపణలు చేయడం ఎంత మాత్రం తగదు. ఒక మహిళకు చేయూత నివ్వడం ద్వారా ప్రతి ఒక్కరూ పాటించ తగ్గ పని ఎన్టీఆర్ చేసారనడంలో ఎటువంటి సందేహం లేదు.

నెల్లూరు —యద్దనపూడి సరోజిని

### పనులు లేవు - పన్నులు పెంచారు

నెల్లూరు మునిసిపాలిటీ అభివృద్ధి చెందిన ప్రాంతాలను, చెందని ప్రాంతాలను పన్నుల పెంపక విషయంలో ఒకే గాటన కట్టినట్లుంది. అణుమాత్రం అభివృద్ధి చెందని జిల్లా పరిషత్ కాలనీ వాసుల పై కూడా 120 శాతం పెంచడం న్యాయమా

— 8 పేజీలో

ఎంబిఏ కోర్సు, జిమ్నాజియం, ఆడిటోరియం

# ఆటల పేరుతో పిల్చి హామీలు తీసుకున్నారు!

జను పొరదులు క్రీడాభిమానులన్న విషయం అందరికీ తెలిసిందే! వి.ఆర్. కాలేజి యాజమాన్యం తమ దేశకొవ్వాక ఘనంగా ఏదో ఒక కార్యక్రమం చేసి జనం దృష్టిలో పడాలనే తలంపుతోనే అంతర కళాశాలల క్రీడోత్సవానికి శ్రీకారం చుట్టినట్లుంది. యూనివర్సిటీ పరిధిలో గల 40 కళాశాలలకు చెందిన 400 మందికి పైగా క్రీడాకారులు విచ్చేసి ఈ క్రీడోత్సవాన్ని కన్నుల పండుగ కావించారు. బాస్కెట్ బాల్‌లో నెల్లూరు వి.ఆర్. కళాశాల బాలుర జట్టు పోరాట పటిమ చూపి విజేత అయ్యింది. వీరి గెలుపుకు మ్యాచ్ పూర్తయినంత వరకు కోర్ట్ వద్ద

## విఆర్ కాలేజికి వరాల వాగ్దానాలు!

మన్న రాష్ట్ర ఛాంపియన్లయిన జిల్లా బాలికల జట్టు కారణమన్నట్లుగా కనపడింది. అన్నింటి కంటే ఆశ్చర్యమేమిటంటే క్రీడా మైదానమే లేని సర్వోదయ కాలేజ్ అథ్లెటిక్స్ ఛాంపియన్ కావడం. ఆ కళాశాల విద్యార్థి ముబార్ అహమ్మద్ అసమాన ప్రతిభ చూపి ఆ గౌరవం సంపాదించాడు. ఓవరాల్ గేమ్స్ ఛాంపియన్ షిప్‌ను కడప గవర్నమెంటు డిగ్రీ కళాశాల కుర్రవాళ్లు కొట్టుక పోయారు.

11 తేదీ వుదయం రంగు రంగుల జెండాలతో నిండిన వి.ఆర్. కళాశాల మైదానంలో తెల్లని దుస్తులలో తళతళలాడు తుండిన నెల్లూరు విద్యార్థినులు మార్చ్ ఫాస్ట్ చేస్తూ యూనివర్శిటీ వైస్ ఛాన్సలర్ ప్రొఫెసర్ పి. జయరామిరెడ్డి గౌరవ వందనం సమర్పించారు. వెంకటేశ్వర యూనివర్శిటీ క్రీడలలో చాలా వెనుకబడి వుందని, క్రీడల అభివృద్ధి కోసం ఒక పథకం రూపొందిస్తున్నామని చెప్పారు వైస్ ఛాన్సలర్ గారు. క్రీడల వల్ల సంఘీభావం, పరస్పర అవగాహన ఏర్పడతాయని. వి.ఆర్. కళాశాలలో ఎంబిఏ కోర్సుకు సంబంధించిన ప్రతిపాదనలను కరస్పాండెంట్ వివేకానంద రెడ్డి పంపితే మంజూరు

కొరవ 10 పేజీలో

అథ్లెటిక్ ఛాంపియన్‌గా బహుమతి స్వీకరిస్తున్న సర్వోదయ కాలేజి విద్యార్థి ముబార్ అహమ్మద్‌తో, ఉత్సవ నిర్వాహకుడు ఆనం వివేకానంద రెడ్డి

క్రీడోత్సవాలు జరిపిన గౌరవంతో పాటు, బహుమతి గెల్చుకున్న గర్వాన్ని వి.ఆర్ కాలేజికి సమకూర్చి పెట్టిన బాస్కెట్ బాల్ జట్టు ఆటలో నిమగ్నమై వుంది.

# కాసులకు దాసోహం!

సినీ పాటల రచయితలు కాసుల కోసం నిర్మాతలు కోరే ఎటువంటి సాహిత్యాన్నైనా రాయను వెనుకాడం లేదన్న నిజాన్ని సినీ పాటల రచయిత, నెల్లూరీయుడు వెన్నెల కంటి రాజేశ్వర ప్రసాద్ వప్పుకొన్నారు. 12 తేదీ కస్తూర్బా కళాక్షేత్రంలో 'రెస్కో' స్వచ్ఛంద సంస్థ సన్మానాన్ని అందుకొన్న అనంతరం ప్రసంగిస్తూ పై విషయాన్ని వెల్లడించారు. అన్ని రంగాల్లో మాదిరి కళారంగంలో కూడా కాలుష్యం కాలూనిందని. దాన్ని ప్రజలే నిర్మూలించాలని ఆయన పిలుపిచ్చారు. సమాజంలోని దుర్నీతులు రూపు మాపేందుకు స్వచ్ఛంద సంస్థలు నడుం కట్టాలని అధ్యక్ష స్థానమలంకరించిన శాసన సభ్యుడు జె.కె. రెడ్డి సలహా యిచ్చారు. మాజీ శాసన సభ్యుడు చెన్నారెడ్డి పెంచలు రెడ్డి, సర్వోదయ లెక్చరర్ పి. శ్రీనివాసులు

## నెల్లూరు సంగతులు

తదితరులు మాట్లాడారు. సారా వుద్యమానికి మద్దతుగా సంస్థ నిర్వహించిన పోటీల్లో విజేతలైన విద్యార్థులకు అతిథులు బహుమతులందజేశారు. వెటరన్ క్రీడాకారుడు డాక్టర్ శ్రీధర్ రెడ్డిని కూడా సంస్థ సన్మానించింది. చివరన రెస్కో ఆర్కెస్ట్రా బృందంచే సంగీత విభావరి జరిగింది.

### బ్యాంకు పరీక్షలకు వుచిత శిక్షణ

టౌన్‌లోని అశోక జెనివల్ కాలేజి బి.ఎస్.ఆర్.బి పోటీ పరీక్షలకు హాజరయ్యే అభ్యర్థులకు వుచిత శిక్షణ ఇవ్వనున్నట్లు ప్రకటించింది. ఈ తరగతులు సెప్టెంబరు 20 తేదీ మొదలవుతాయిట. ఆసక్తి గలవారు 19 తేదీ లోగా ఫత్తేఖాన్ పేటలోని తమ సంస్థకు వచ్చి పేర్లు నమోదు చేసుకోమని డైరక్టర్ టి. గంగాధర రావు కోరుతున్నారు.

### సన్మాన సభ

నెల్లూరీయుడు, ఆంధ్ర ప్రదేశ్ ఎంప్లాయ్‌మెంట్ ట్రైనింగ్ డైరక్టర్‌గా పనిచేసి ఇటీవల పదవీ విరమణ చేసిన శ్రీ ఎల్.పి. సుబ్రహ్మణ్యం సన్మాన సభ 6 తేదీ మూలాల బాలతిమ్మయ్య కళ్యాణ మండపంలో ఘనంగా జరిగింది. జిల్లాలోని ప్రభుత్వ, ప్రైవేట్ ఐ.టి.ఐ.ల యజమాన్యాలు ఈ కార్యక్రమానికి నడుంకట్టాయి. అయన్ను

(కొరవ 11 వ పేజీలో)



## సణుగుడు

### ఇంత నీచత్వం తర్వాత కూడా నాయకుడిగా చూడాలా?

డోలేంద్ర

నీచత్వానికి ఒక నియమం వుండాలి; పతనానికీ ఒక సరిహద్దు వుండాలి; దిగజారుడుకూ ఒక లోతట్టు వుండాలి; ఆత్మవంచనకూ ఒక పరిమితి వుండాలి; అసత్య ప్రేలాపనకూ ఒక అవధి వుండాలి.

జనం గొర్రెలే కాదనము; అందులోనూ ఆంధ్రులు మరీ అమాయక జీవాలు – అందులో సందేహం లేదు. భూమాత భూమి బరువు. ఓర్పు గుణం రెండింటినీ మోయలేక, బరువన్నింటి భూమిని మాత్రం తన భుజాల పై వుంచుకొని, క్షమ గుణమనే ద్విగుణాలను ఆంధ్రుల బుర్రల్లోకి జార విడ్చినట్లుంది. అందుకే మనం ఎంతటి తప్పునైనా క్షమించేస్తున్నాం; ఎంతటి దారుణాన్నయినా సహించ గల్గుతున్నాం.

ఆ ధైర్యం లేకుంటే ఎన్టీఆర్ ఈ పాడు పని చేస్తాడా? అంత నీచానికి దిగజారుతాడా? దిగజారి, అది మహా పుణ్యకార్యంగా దబాయించ గల్గుతాడా? సిగ్గుపడాల్సిన పని చేసి అభ్యుదయంగా అభివర్ణించుకో గల్గుతాడా? పాదాల పై వాలి, చెప్పులను తమ నాలుక తడితో పాలిష్ చేసే తెలుగుదేశం వందిమాగధ దళం ఈ ముసలి శోభనం పెళ్లి కొడుకు పడక గది దగ్గర చేరి కీర్తనలు పాడ గల్గుతారా?

ఎంత నీచం? ఎంత రోత? ఎంత సిగ్గు మాలిన తనం? ఎంత బరితెగించిన తనం? ఎంత మానరహితం? ఎంత అవమానకరం? తన పళ్లు జబ్బులతో కుళ్లి పోతే, చావు గంట చెవుల్లో మ్రోగుతుంటే, శరీరం నుంచి ప్రయాణానికి ఆత్మ పెట్టె సర్దుకో బోతుంటే ప్రక్కన చేరి, సపర్యలు చేసి, ప్రాణం నిల్పినందుకు కృతజ్ఞతగా పార్వతిని పెళ్లాంగా స్వీకరించానని చెప్తున్నాడీ ప్రబుద్ధుడు! కానీ ఆ సమయంలో ఆ పార్వతి అతగాడి దగ్గర ఒంటరిగా పడగ్గదిలో ఎందుకుంది? ఏమి చేస్తుండింది? అసలెవరీ పార్వతి? ఎన్టీఆర్‌కు, ఆమెకు ఏమి సంబంధం? ఎన్నాళ్ల నుంచి వారిద్దరి మధ్య అక్రమ సంబంధం?

ప్లాస్టిక్ పువ్వులు పెట్టినా పెట్టించుకోవడానికి చెవులు చాచి పెట్టుకొని రెడీగా వుండే వెంగళప్పలు జనమని నమ్మకం వుండబట్టే ఎన్టీఆర్ ఆత్మకథ అనే అతికని అబద్ధం

కొరవ 7 పేజీలో

## గోగులపల్లి భూమి పై భూబకాసురుల కన్ను!

అల్లూరు మండలం గోగులపల్లి గ్రామంలో 50 ఎకరాల మిగులు భూమి పై భూబకాసురుల కన్ను పడింది. రెవిన్యూ అధికారుల అండదండలతో ఆక్రమణలకు రంగం కూడా సిద్ధమయ్యింది. ఇటీవల ఈ ప్రాంతంలో విస్తారమవుతున్న రొయ్యల పరిశ్రమ మూలంగా ఇక్కడి భూములకు గిరాకీ ఏర్పడింది. ఈ నేపథ్యంలో 488 సర్వే నెంబరు గల భూమిలో ఇంతకు ముందు బలహీన వర్గాలకు ఉప్పు కొఠార్లకు కేటాయించిన భూమి పోగా లోతట్టు ప్రాంతంలో మరి కొంత భూమి వుందన్న పోటీని రెవిన్యూ వర్గాల ద్వారా అల్లూరులో ఉప్పు వ్యాపారస్తులు తెలుసు కోగలిగారు. ఈ భూములు రొయ్యల సాగుకు అనుకూలంగా ఉండడంతో దీనిపై వ్యాపారస్తులు మోజును పెంచుకున్నారు. ఏదో ఒక రూపేణా తమకు స్వాధీనం చేయమని ఇరు వర్గాల వారు రెవిన్యూ సిబ్బందికి భారీ మొత్తంలో ముడుపులు కూడా అందజేశారట. ముడుపులకు సంతృప్తిచెందక పోవడంతో మందు తృప్తి కూడా కల్గించను అధికారులను నెల్లూరులోని ఒక బారుకు ఒక వర్గం తోడుకొని రాగా ఈ విషయం తెలుసుకున్న మరో వర్గంకి బారు వద్దనే ప్రతిఘటించి, బాహాబాహికి సిద్ధమైనారట. ఇంతలో ఈ విషయం ఈనోటా ఆ నోటా ప్రాకి గోగులపల్లి గ్రామానికి చేరింది. అక్కడి మహిళలు ఆ మిగులు భూమిని పేదలమైన తమకు పంచాలని వారం రోజుల క్రితం అల్లూరు ఎమ్మార్వో కార్యాలయం ముందు ధర్నా చేయడంతో ఈ వివాదం ముదిరి పాకాన పడింది. ఈ విషయమై జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర, కావలి ఆర్డీవో 15 తేది గోగులపల్లికి పోయి భూమి పరిశీలన జరిపారట.

## జిల్లావార్తలు

* గోగులపల్లిలో రొయ్యల భూమి దురాక్రమణ
* యల్లాయపాళెం పారుదల కాలువ పూడ్చివేశారు
* కావలి టీచర్‌కి ఉత్తమ అవార్డు

### పారుదల కాల్వను పూడ్చేశారు

పారుదల కాల్వల మరమ్మత్తుల కోసం ప్రభుత్వం ఒక పక్క కోట్లాది రూపాయలు కేటాయిస్తుంటే, ఘనత వహించిన పి.డబ్ల్యూ.డి అధికారులు పారుదల కాల్వలను పూడ్చి తమ ఘనతను చాటు తున్నారు. యల్లాయ పాళెం నుండి మలిదేవిలోకి డ్రైనేజి నీళ్లు పోయేందుకు వున్న కాలువను మలిదేవి మరమ్మత్తులంటూ పి.డబ్ల్యూ.డి వాళ్లు పూడ్చేశారు. ఈ కాల్వ క్రింద నార్తు రాజుపాళెం గ్రామానికి సంబంధించిన 600 ఎకరాల భూమి సాగుబడిలో వుంది. కాల్వ పూడ్చిన కాంట్రాక్టర్ విషయాన్ని రైతులు నీటి పారుదల వున్నతాధికారుల దృష్టికి తీసుకెళ్లినా ఫలితం శూన్యమట. కలెక్టర్‌గారు జోక్యం చేసుకోక పోతే తమ భూములు బీడుగా పెట్టుకోవడం మినహా వేరే గత్యంతరం లేదంటున్నారీ రైతులు.

### ఉత్తమ ఉపాధ్యాయుడు రామమోహనరావు

93 సంవత్సరానికి జిల్లా స్థాయిలో ఉత్తమ ఉపాధ్యాయుడుగా కావలి నరేంద్ర భారతి ఓరియంటల్ హైస్కూలు ప్రధానోపాధ్యాయుడు శ్రీకె. రామ మోహనరావు ఎంపికయ్యారు. ఉపాధ్యాయ దినోత్సవాన్ని పురస్కరించుకొని నెల్లూరు కస్తూరిదేవి విద్యాలయంలో విద్యాశాఖ జరిపిన ప్రత్యేక సభలో రామమోహనరావును దుశ్శాలువాతో సన్మానించి, ప్రశంసా పత్రాన్ని అందించారు. రామమోహన్‌రావు ప్రతిభగల ఉపాధ్యాయుడే కాక చేయితిరిగిన పాత్రికేయుడు కూడా.

### కలిచేడు భద్రతా వారోత్సవాలు

సైదాపురం మండలం కలిచేడులో 31 వ గనుల భద్రతా వారోత్సవాలు 12 తేది జరిగాయి.

కొరవ 7 పేజీలో

## గంభోర వ్యాధికి హోమియో మందు!

కోళ్ల పరిశ్రమ పాలిట మృత్యు పిశాచి వలె పరిణమించిన గంభోర వ్యాధికి తన వద్ద హోమియో మందు వుందని డాక్టర్ పి. మదన మోహన రావు చెప్తున్నారు. గంభోర అనేది ఒక విచిత్రమైన వ్యాధి. రెండు నెలల లోపు వయస్సులో ఇది ఫారం కోళ్లకు సంక్రమిస్తున్నది. దానికి మందే లేదు. ఫారంలోని కోళ్లన్నీ ఒక్కసారిగా చనిపోతాయి. నిస్సహాయంగా ఆ సామూహిక మరణ దృశ్యాన్ని కన్నీళ్లతో వీక్షించడం తప్ప రైతు చేయగల్గింది ఏమీ లేదు. జిల్లాలో ఇప్పటికి వ్యాధికి ఎన్ని వేల కోళ్లు చచ్చాయో లెక్క లేదు. మొత్తం కోళ్ల పరిశ్రమే సంక్షోభంలో పడిపోతున్నది దీనివల్ల.

ఇంతటి దారుణమైన తెగులుకు తాను మందు కనిపెట్టానంటున్నారు డాక్టర్ మదన్ మోహన్ గారు. ఒక ఫారంలో వాడి చూస్తే వ్యాధి సోకిన కోళ్లు పూర్తిగా కోలుకున్నాయట. రైతులు తనను సంప్రదిస్తే వారికి సలహా, మందు కూడా ఉచితంగానే ఇస్తామంటున్నారు డాక్టర్ గారు. రైతులు ఒక ఛాన్సు ప్రయత్నించి చూడవచ్చు.

## షేర్ల పేరు చెప్పి లక్షలకు టోపీ పెట్టిన ఆంధ్రా బ్యాంకు ఉద్యోగి!

నెల్లూరు స్టోన్ హౌస్‌పేట ఆంధ్రబ్యాంకు ఉద్యోగి పివిఎస్ కోదండరామ్ తమను షేర్ల పేర్లతో మోసగించాడని కొందరు బాధితులు పోలీసు ఫిర్యాదు చేశారు. కోదండరాం ఆంధ్రబ్యాంకు క్లర్కు అట. తన భార్య శ్రీమతి లలిత పేరుతో కొంతకాలం క్రింతం షేర్ కన్సల్టెన్సీ ప్రారంభించాడు. బ్యాంకు ఉద్యోగి కావడంతో జనం అతడ్ని అమాయకంగా నమ్మారు. రిటైర్డ్ ఉద్యోగులు, కాలేజి లెక్చరర్లు, డాక్టర్లు కూడా అతడి ద్వారా షేర్లు అమ్మడం కొనడం చేశారట. కొంతకాలం ఇట్లా జరిగి, నమ్మకం కుదిరిన తర్వాత అసలు రూపం బయట పడింది. షేర్లు కొనడానికి డబ్బు అడ్వాన్సుగా తీసుకొని, స్వాహా చేయడం; కస్టమర్ల దగ్గరుండే షేర్ సర్టిఫికెట్లను ఎక్కువ

కొరవ 7 పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు
విమర్శకుడు

## మంత్రి యానాది రెడ్డి తొలిపర్యటన

సహకార మంత్రి శ్రీ కలికి యానాది రెడ్డి గారు ఈ రోజు ఉదయం(17తేది) ధార్మినార్ ఎక్స్‌ప్రెస్‌లో నెల్లూరు వచ్చారు. మంత్రిగా ఆయన తొలి జిల్లా పర్యటన ఇది. ఇందిరా భవన్‌కు వెళ్ళి ఇందిరమ్మ విగ్రహానికి పూలమాల వేశారు. ఆత్మీయులు, అభిమానులనుకున్న వారిని కలిశారు. విష్ణు ఉదయాహారం, బి.కె. మధ్యాహ్న భోజనం ఆరగించారు. మధ్యాహ్నం హారట కావలికి వెళ్ళారు. రాత్రికి బహిరంగ సభ వుంది. రేపు (18 తేది) కావలి కాలువ సందర్శన. పల్లెటూళ్ళ పర్యటన; ఆర్‌డిఒ ఆఫీసులో సభ. 19 తేది ఉదయం టౌన్‌లో మంచి నీటి పథకాల పరిశీలన. ఇప్పటికివే కార్యక్రమాలు. ఎప్పుడు తిరిగి వెళ్ళేది ఇంకా తెలలేదు.

యానాదిరెడ్డి గారికి నెల్లూరు రైల్వే స్టేషన్‌లో ఘన స్వాగతం లభించింది. కావలి నుంచి పాతికకు పై బడిన కార్లు, బస్సులలో జనం వచ్చి స్టేషన్‌లోనే ఆయన్ను పూలమాలల మధ్య నలిపి పారేశారు. కావలిలో ఏర్పాట్లు ఇంకా అట్టహాసంగా వున్నాయని వార్త. యువ నాయకులు యానాదిరెడ్డి, వెంకటేశ్వర్లు పోటీలు పడి దరబదలు సృష్టిస్తున్నారు.

## నువ్వులకు అనారోగ్యం

రాపూరు ఎమ్మెల్యే శ్రీ నువ్వుల వెంకట రత్నం నాయుడు గారు హఠాత్తుగా అనారోగ్య పీడితులైనారు. హృదయ చలనంలో తేడా రావడం వల్ల ఆయన్ను 15 తేది హైదరాబాదు నిమ్స్ ఆసుపత్రిలో చేర్పించారు. ఇప్పుడు కొంత మెరుగ్గా వుందని తెలుస్తుంది.

వెంకట రత్నం నాయుడు త్వరగా కోలుకొని, పూర్ణారోగ్యంతో తిరిగి రావాలని ఆకాంక్షిస్తున్నాము.

## సొందాయమ్మ అరెస్ట్

పసి పిల్లల విక్రయం కేసులో నిందితురాలైన నాయుడు పేట బాల నేరస్తురాలు శ్రీమతి సొందాయమ్మను సిబిసిఐడి అధికారులు 11 తేది అరెస్ట్ చేశారు. కోర్టు ఆమెకు బెయిల్ ఇవ్వలేదు. వారం రోజులు రిమాండ్‌కు పంపింది. ఆమె ఇంటిని సోదా చేసి కొన్ని రికార్డులు, పుస్తకాల స్వాధీనం చేసుకున్నారు. సొందాయమ్మ పసిపిల్లలను సేవా దృక్పథంతో దత్తత ఇవ్వడం కాక, వ్యాపార దృష్టితో విక్రయం చేసినట్లు తమకు స్పష్టమైన ఆధారాలు లభించాయని, అమెరిక విదేశాల నుంచి అక్రమ దారులలో నిధులు రావడం వల్ల ఫెరా చట్టం క్రింద కూడా కేసులు పెట్టే వీలుంది అన్నారు.

ఎన్నుందని సిబిసిఐడి అధికారులు చెప్తున్నారు.

సొందాయమ్మ మాత్రం ఇప్పటికీ తాను నిర్దోషి నంటున్నది.

## తిక్కవరపు చంద్రశేఖర రెడ్డి కాలధర్మం!



రాజ్యసభ సభ్యుడు, కాంగ్రెస పార్లమెంటరీ పార్టీ కార్యదర్శి, డక్కన్ క్రానికల్ గ్రూపు పత్రికల అధిపతి శ్రీ తిక్కవరపు చంద్రశేఖర రెడ్డి 15 తేది హైదరాబాదులో మరణించారు. ఆయన చాలా కాలం నుంచి అనారోగ్యంతో బాధ పడుతున్నారు. హృదయ సంబంధ వ్యాధితో పాటు, పక్షవాతానికి గురైనారు. దాదాపు సంవత్సరం నుంచి పూర్తిగా ఇంటికే పరిమితమై, వైద్య సహాయంతో కోలుకున్నారు. పూర్తి స్వస్థత కుదిరిందని, ఇక మామూలుగా తిరుగుతాడని భావిస్తున్న సమయంలో మృత్యువు కబళించి వేసింది. మెదడులోని నరాలు చిట్లి హఠాత్తుగా కన్ను మూశారాయన.

చంద్రశేఖర రెడ్డి జగదేవి పేట వాస్తవ్యుడు గునుపాటి కుటుంబం ప్రేరణతో కాంట్రాక్టరుగా నాగార్జున సాగర్ పనులు చేపట్టి ఇటు కీర్తి, అటు సంపద రెండూ ఆర్జించాడు. కాంట్రాక్టు పనుల నాణ్యత, సమర్థతలకు ఆయనకు రాష్ట్రపతి బంగారు పతకం లభించింది. 1977 లో డక్కన్ క్రానికల్ పత్రికా సంస్థను కొనుగోలు చేశాడు. తన వనరులు, మేధస్సు వుపయోగించి దాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చాడు. ఆంధ్రభూమి దిన పత్రికను కోస్తా జిల్లాలకు విస్తరింపజేశాడు. అంజయ్య ముఖ్యమంత్రిగా వున్నప్పుడు 1980లో తొలిసారిగా రాజ్యసభకు ఎంపికై, ఆ తర్వాత రెండు సార్లు అదే పదవి పొందారు. వరుసగా మూడు సార్లు రాజ్యసభకు ఎన్నికైన కాంగ్రెస్ వాదులు చాలా అరుదు.

శ్రీ తిక్కవరపు సుబ్బరామరెడ్డి చంద్రశేఖర రెడ్డికి సోదరుడు; అన్నదమ్ములిద్దరూ రాజకీయాలలో, కాంట్రాక్టులలో రాణించడం విశేషం. చంద్రశేఖర రెడ్డి గారికి ఇద్దరు కుమారులు ప్రస్తుత డక్కన్ క్రానికల్ మేనేజింగ్ ఎడిటర్ శ్రీ వెంకట్రామ్ రెడ్డి ఆయన పెద్ద కుమారుడు.

వారి కుటుంబానికి మా సానుభూతి.

తని పై వార్తలు వ్రాసిన విలేఖర్లు అంతు చూస్తానని శాపనార్థాలు పెడుతున్నది.

## రైల్వే ఎంక్వైరీకి కొత్త ఫోన్

నెల్లూరు రైల్వే స్టేషన్ ఎంక్వైరీ ఫోనుతో జనం పడుతున్న బాధలు గమనించి ఇంకొక ఫోను ఏర్పాటు చేసింది రైల్వే శాఖ. కొత్త ఫోన నంబరు – 26735 ఇది అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్ వద్ద వుంటుంది.

ఈ ఏర్పాటుకు రైల్వేలకు థ్యాంక్స్ చెప్తున్నారు – రైల్వే ప్రయాణీకుల కమిటీ జోనల్ మెంబరు శ్రీ ఒమ్మిన సుబ్రహ్మణ్యం.

## డాక్టర్ల సమ్మె

వైద్య సేవలను వినియోగదార్ల సంఘం పరిధిలోకి తెచ్చినందుకు నిరసనగా నెల్లూరు డాక్టర్లు ఈ రోజు (17 తేది) సమ్మె చేశారు. ఐఎంఏ సభ్యులెవరూ క్లినిక్‌లకు రాలేదు.

## తెలుగుదేశం

(6 పేజీ తరువ)

తమకు విలువ పోతుందని చంద్రబాబు దిగులు పడుతున్నాడు.

ఎన్టీఆర్ త్వరలో తన కొత్త భార్యను పార్టీలోని ఒకకీలక పదవిలో నియమించబోతున్నారని వార్త. తన రాజకీయానికి ఆమెను వారసురాలిగా చేయాలన్నది ఆయన తలంపట.

తెలుగు దేశంకు విజయావకాశాలు స్పష్టంగా కన్పడుతున్న ఈ సమయంలో ఎన్టీఆర్ ముసలి ప్రేమ పిచ్చి పార్టీ భవిష్యత్తు సమాధిగా పరిణమిస్తున్నదన్న భీతి ప్రతి తెలుగు నాయకుడిలో, కార్యకర్తలో వుంది. ప్రజలలో దీనిపై విన్పిస్తున్న ఛీత్కారాలు వారిని ఆందోళన పరుస్తున్నాయి. ప్రజా జీవితంలో వుండే నాయకుడు శీలము, నైతిక విలువలు వదలిపెట్టి, పచ్చి వ్యభిచారిగా ప్రవర్తించడాన్ని ప్రజలు అసహ్యించుకుంటున్నారన్న వార్తలందడంతో వారు దిగాలు పడిపోతున్నారు. కేవలం తోడుకోసం, ముసలి వయస్సులో సహాయం కోసం మూరు మనువాడాడు ... లైంగిక వాంఛలతో కాని, ఇందులో తప్పులేదని ప్రచారం చేయడం ద్వారా ప్రజలను మెప్పించడానికి పాట్లు పడుతున్నారు. కాని ఎన్ని చెప్పినా, జనం మధ్యలోకి వెళ్తే ఎదురౌతున్న హేళనలు, వ్యాఖ్యానాలను తట్టుకోవడం తెలుగు దేశం వాదులకు కష్టంగానే వుంది.

ఎన్టీఆర్ పెద్దల్లుడు డాక్టర్ వెంకటేశ్వరరావు విదేశ యాత్రలో వున్నారు. ఆయన తిరిగి వచ్చిన తర్వాత కుటుంబ సభ్యులందరూ కలసి కట్టుగా వ్యవహరించి పార్వతిని ఇంటికే పరిమితం చేసేందుకు ఎన్టీఆర్‌ను వప్పించాలని తలపెడుతున్నారట. కాని పార్వతిని ఏమైనా అన్నా, ఆమెకు తనకు మధ్య జోక్యం చేసుకున్నా తెలుగు దేశం పార్టీనే రద్దు చేసి, రాజకీయాలనుంచి విరమించుకుంటానని ఎన్టీఆర్ బెదరిస్తున్నారట.

## సణుగుడు

(4 పేజీ తరువాయి)

చెప్పినాడు. ఆత్మకథ సాకుతో అవి తన దగ్గరకు వచ్చింది నిజమే కావచ్చు కాని, ఆ తర్వాతదంతా అక్రమ సంబంధమన్న సంగతి ఆయన చెప్పనవసరం లేదు. మన మద్దెం చేసుకోవచ్చు 1989 లో ఇద్దరికీ ప్రథమ పరిచయమని ఆయనే చెప్పారు. ఆత్మకథ అంటూ వ్రాయడం ఉద్దేశ్యమైతే నాలుగేళ్ల వ్యవధిలో నాలుగు పేజీలైనా వ్రాసి వుండాలి కదా? ఎన్టీఆర్ జీవిత కథను మాజీ ఇండియా టుడే ఎడిటర్ శ్రీ వెంకట నారాయణ వ్రాశారు. అప్పుడాయన ఈ పార్వతి వలె ఇంట్లో ఏళ్ల తరబడి మకాం పెట్టలేదే! జీవిత చరిత్రలు వ్రాసేవారు సంబంధితులను సన్నిహితంగా పరిశీలించడానికి కొంత కాలం దిన చర్యను గమనిస్తారు. తప్ప కాపురాలు పెట్టరు.

లక్ష్మి పార్వతి తన భర్తకు ఏడాది క్రితం విడాకులు ఇచ్చింది. దాదాపు రెండేళ్ల క్రితం నుంచి ఎన్టీఆర్ ఇంటిలో మకాం పెట్టి రాకపోకలు సాగిస్తూ వుంది. కేవలం జీవిత చరిత్ర వ్రాయడమే ఉద్దేశ్యమైతే వున్న లెక్చరర్ ఉద్యోగానికి రాజీనామా ఇవ్వవలసిన అవసరం లేదు; కట్టుకున్న వాడికి విడాకులివ్వ వలసిన అవసరం లేదు; ఏకంగా ఎన్టీఆర్ ఇంట్లో కాపురం పెట్ట వలసిన అవసరం లేదు; అతడి పడగదిలో గడప వలసిన అవసరం లేదు. తన అనారోగ్యం, సేవలు, మద్దిగడ్డలు అనే కాకమ్మ కథలు చెప్పినాడు ఎన్టీఆర్. ఆయనకు పక్షవాతం వచ్చింది నాలుగు నెలల క్రితం – పార్వతి ఎన్టీఆర్ ఇంటికి మకాం మార్చింది అంతకు ఏడాది క్రితం. మానవతా దృక్పథంతో మనువాడానన్నది ఒట్టి అభూత కల్పన; మానవహిత కార్యానికి మర్యాద రంగు పులిమే వ్యర్థ ప్రయత్నమే ఇది.

పెళ్లాం చితి ఆరక ముందే రెండో పెళ్లికి బాసికాలు కట్టుకునే దౌర్భాగ్యులు ఆంధ్రదేశంలో కోకొల్లలుగా వున్నారు. అందుకు ఎన్టీఆర్‌ను తప్పు పట్ట వలసిన అగత్యం లేదు. అయితే డెబ్బయ్ ఏళ్ల వయస్సులో అక్రమ సంబంధం కోసం ప్రాకులాడడం, మరొకరి భార్యను తీసుకొచ్చి ఇంట్లో పెట్టుకొని వారి సంసారాన్ని ఛిద్రం చేయడం, విడాకులిప్పించడం, రెండో పెళ్లి పేరుతో అట్టహాసపు ప్రచారం చేసుకోవడం, ఫోటోలకు ఫోజులివ్వడం.... ఒక జాతీయ ప్రతిపక్ష కూటమి నాయకత్వ హోదాలో ఈ రోత పనులన్నీ వెలగ బెట్టడమే వినేవారికి వికారం కల్గిస్తున్నాయి; చూసేవారికి ఛీ అన్పిస్తున్నాయి.

రాజకీయాలవతల పెట్టండి: వ్యక్తిగత జీవితమే తీసుకోండి. ఈ పెద్దమనిషికి సహధర్మచారిణిగా జీవితం గడిపి, పన్నెండు మంది పిల్లలను కని ఇచ్చింది మహాతల్లి బసవ తారకమ్మ. ఆ విశ్వాసం కూడా లేదీ పురుషుడికి. తన వంటి నియంతృత్వ పోకడలు, అహంకారం, సర్వావలక్షణ సమన్విత మానసం కల్గిన వ్యక్తితో అన్నేళ్లు ఓర్పుగా గడిపిన ఆమె స్మారకార్థం ఒక ఆస్పత్రి పెడతానని ధని డబ్బులు దండాడీ వాహనీ వారి పెద్ద మనిషి. బ్రహ్మర్షి విశ్వామిత్రను ఆ పేరుతో కోట్లకు అమ్మారు. ఆ ఆస్పత్రి ఏమైందో తెలియదు. చచ్చిన పెళ్ళాం పేరుతో దండిన డబ్బు పెట్టి, కొత్త పెళ్లాం కోసం ఇల్లు కట్టించే తత్వం కల్గినవాడిని నాయకుడిగా సరే - కనీసం మనిషిగానైనా గుర్తించ మనస్కరిస్తుందా?

మానవత్వ విలువల మీద ఏమాత్రం మమకారం వున్నా ఎన్టీఆర్ ఈ నీచకృత్యానికి ఒడికట్టి వుండడు. వుండలేదు. అనారోగ్య పరిస్థితులలో సేవ చేసేది కేవలం భార్యేకాదు- కూతురు, తల్లి కూడా సేవలు చేస్తారు. పార్వతమ్మను కృతజ్ఞతా భావంతోనే తన జీవితంలోకి ఆహ్వానించి వుంటే-ఆమెకు భార్య స్థానం ఇవ్వ వలసిన అవసరం లేదు. ఇద్దరి మధ్య వున్న వయోభేదాల దృష్ట్యా కూతురిగా దత్తత తీసుకొని వుండవచ్చు. విశ్వాసంతో, కృతజ్ఞతతో తన ఆస్తిలో భాగం పంచి ఇచ్చివుండవచ్చు. నీచమైన కామావేశం తప్ప మరే సంస్కారవంత ఆలోచన లేని వాడుకాబట్టి ఆ కక్కుర్తికి పాల్పడ్డాడు.

ఎన్టీఆర్‌ను ఇంకా రాజకీయ వాదిగా, నాయకుడిగా గౌరవిస్తే అది తెలుగు తనాన్నే అవమాన పరచినట్లవుతుంది. అటువంటి కుసంస్కారులు, మానసిక వైకల్యం కల్గిన వారిని రాజకీయం నుంచే కాక, సంఘ బహిష్కారానికి కూడా గురిచేయగల్గితే తెలుగు ఆత్మగౌరవం పరిఢవిల్లుతుంది.

## తెలుగుదేశం

( మొదటి పేజీ తరువాయి)

అప్పుడు జరగవు. నెలరోజుల ముందుగా రిజిస్ట్రార్‌కు వధూవరులిద్దరూ కలిసి నోటీసివ్వాలి. ఆ నోటీసు, బోర్డులో అతికించాలి. ఆ తర్వాతనే పెళ్లి రిజిష్టర్ అవుతుంది. అప్పటికప్పుడు తిరుపతిలో తనకు ఆలోచన కల్గినట్లు, దేవుడి సన్నిధిలో ఈ '' పవిత్ర కార్యం '' తలపెట్టడం దైవ సంకల్పమైనట్లు జనాన్ని మోసగించే మాటలు చెప్పారు ఎన్టీఆర్.

ఏమైతేనేమి జరగకూడనిది జరిగిపోయింది. ప్రపంచంలో ఏ రాజకీయ వాది కూడా ఇంత నిస్సిగ్గుగా అక్రమ సంబంధాలను పబ్లిక్ మీటింగులలో చెప్పుకోలేదు. ఆ విషయంలోనూ ఎన్టీఆర్ రికార్డు సృష్టించినట్లే లెక్క. అయితే దీని ప్రభావం పార్టీపై ఏ మేరకు పడుతుందో అర్థం కాక తెలుగుదేశం నాయకులు జుట్లు పీక్కుంటున్నారు. కొన్ని లక్షల మంది కార్యకర్తలతో ముడిపడిన పార్టీ దాని భవిష్యత్‌ల కంటే తన మోహము, కామాంధత ఎక్కువన్నట్లు ప్రవర్తించడంతో నాయకులకు పిచ్చి పట్టి పోతున్నది. ఇటువంటి పర్వర్టెడ్ క్యారెక్టర్ కల్గిన నేత క్రింద వుంటే ఎప్పటికైనా తమ గతి అధోగతే నని భయపడుతున్నారు. ఈ సంఘటనతో పార్టీ ప్రతిష్టకు సమాధి పడిందన్న సంగతి ప్రతి తెలుగు దేశం వాదికీ అర్థమౌతూనే వుంది. ప్రజలు ఛీత్కరిస్తున్నారన్న వార్తలు అందుతూనే వున్నాయి. కాని ఎన్టీఆర్ కాదంటే తెలుగు దేశం వుండదన్న నిరాశ, నిర్వేదాలతో మనసు చంపుకొని వారు ఆయనకు జైజై లు కొడుతున్నారు.

పార్వతీరాముల ప్రణయం పడక గదికి, ఆస్తిపాస్తులకు పరిమితమౌతుందని ఎవరూ భావించడం లేదు. తెలుగు దేశంపై పెత్తనానికి పార్వతమ్మ ఉద్యుక్తురాలౌతున్నట్లు అప్పుడే వార్తలందుతున్నాయి. తమ అభ్యంతరాలు అరణ్యరోదనేనని అర్థం కావడంతో మామగారి ప్రేమ పైత్యాన్ని సహించి సర్దుక పోదామనుకున్న చంద్రబాబాదులకు ఇది మరీ పెద్ద షాక్. ఎన్టీఆర్ ను కలవడానికి వచ్చే కార్యకర్తలు, నాయకులందరూ కూడా పార్వతీ ప్రసన్నం కోసం దర్శనం చేసుకుంటున్నారు. ఎన్టీఆర్ కూడా వచ్చిన వారికి ఆమెను పరిచయం చేస్తున్నారు. ఆఫీసు గదిలో, విజిటర్స్ రూమ్‌లో కూడా ఆమె ఆయన ప్రక్కనే నిలబడి వుంటున్నది. చూసే వారికి ఇవన్నీ ఎబ్బెట్టుగా కన్పిస్తున్నాయి. ఆయన ధోరణి మారకుంటే పార్టీలో

తరువాయి 6 పేజీలో

## జిల్లా వార్తలు

(5 పేజీ తరువాయి)

ముఖ్య అతిథిగా విచ్చేసిన ఇంటలిజెన్స్ డిఎస్‌పి శ్రీ డి. రమణకుమార్ మాట్లాడుతూ గనులలో ప్రమాదాలు జరగకుండా గనుల మేనేజర్లు, యజమానులు శ్రద్ధ వహించాలన్నారు. ఆదేవిధంగా ప్రేలుడు పదార్థాలను సంఘ విద్రోహుల పాలిట పడకుండా చేయ వలసిన బాధ్యత కూడా వుందని చెప్పారు. గనుల యజమానుల తరుఫున శ్రీఅల్లాడి శ్యామసుందర రెడ్డి ప్రసంగిస్తూ మైకా గనుల యజమానులకు ప్రభుత్వపరమైన సహాయం కరువైందని అందువల్లే మైకా ప్రపంచ మార్కెట్ దెబ్బతిన్నదని ఆవేదన వెలిబుచ్చారు. గనుల యజమానులు సి. రామకృష్ణ, ఎం.ఆర్.రెడ్డి, ఎ. రాంగారెడ్డి తదితరులు మాట్లాడారు. మైకా గనుల కార్మికుల యూనియన్ నుండి ఏ ఒక్కరికీ మాట్లాడే అవకాశం ఇవ్వలేదు. ఉత్తమ మైకా గనుల అవార్డులను ఊటుకూరు మీనాక్షి సుందరం మైన్, కలిచేడు సీతారామ మైకా మైన్, కె.ఎస్.ఆర్ మైకామైన్ గెల్చుకున్నాయి. ఉత్తమ మేనేజర్‌గా ఆర్. సుబ్బరాయుడు అవార్డు పొందారు. ప్రకటించిన అతిధులు రాకపోవడం, కార్మికులు వుత్సాహంగా కార్యక్రమంలో పాలు పంచుకోక పోవడం వల్ల చప్పగా వారోత్సవ కార్యక్రమం ముగిసింది.

## ఆంధ్రాబ్యాంకు

(5 పేజీ తరువాయి)

ధరకు కొని, డబ్బు బదులు రెండు నెలల తర్వాత తేదితో బ్యాంకులో డబ్బులేని పనికిరాని చెక్కులిచ్చి, ఇలాంటి పథకం ప్రకారం మోసం చేశాడు. దాదాపు ఆరు లక్షల రూపాయల వరకు కోదండ రామ్ వలలో చిక్కి పోగొట్టుకున్నట్లున్నారు. ఇది చాలదన్నట్లు ఒక ఫైనాన్స్ కంపెనీ ప్రారంభించి, వెల చందాలు దండి, డ్రాలు గీలు లేకుండా కంపెనీ మూసేశారట.

ఈ మోసం బయట పడి రెండు నెలలకు పైనే అయింది. కోదండరాం అప్పటి నుంచి ఎవరికీ దొరకకుండా తప్పించుకొని తిరుగుతున్నారట. చెక్కులు వాపసు అయిన కేసులు కోర్టులో, మోసం ఆరోపణల కేసులు పోలీస్ స్టేషన్లలో నమోదైనాయి. అతిధి ఖాతాదారులందరూ డాక్టర్లూ, లెక్చరర్లూ కావడంతో పైకి చెప్పుకుంటే పరువు పోతుందని సైగ్గా వుండి పోతున్నట్లున్నారు.

స్వల్ప మార్గాలలో ధనార్జన చేయాలనే వ్యామోహం ప్రజలకున్నంత కాలం ఇటువంటి మోసాలు, మోసగాళ్లు తప్పరు. పోలీసులు కొంచెం గట్టిగా దర్యాప్తు చేసి, కఠినంగా వ్యవహరిస్తే ఇక ముందైనా ఇటువంటి మోసాల అరికట్టబడుతాయి.

## నెల్లూరు సబార్డినేట్ జడ్జి వారి కోర్టులో

O.S.No. 77/92

M/s కోకిల ఫైనాన్సియర్స్, నెల్లూరు
- వాది

Vs

కర్నా వెంకటేశ్వర్లు వగైరాలు
- ప్రతివాదులు

To :
(D1) శ్రీ కర్నావెంకటేశ్వర్లు,
S/o ఆదినారాయణ,
తలమంచి, కొడవలూరు మండలం,
నెల్లూరు జిల్లా, అనువారికి,

వాది పై నంబరున దావా పరిహార నిమిత్తం మీ మీద దావా దాఖలు చేసి వున్నందున, మీరు 22-9-93 తేదిన వుదయం 10 గం.లకు పై కోర్టులో హాజరై మీకు గల ఆక్షేపణలు తెల్పుకొనని యెడల, మీ పరోక్ష మందు పై దావా తీర్మానించ బడును.
వాయిదా: 22.9.93

డి. హనుమంతరావు
వాది తరపు అడ్వొకేటు

## నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

S.C. No.13 of 1993

ఇండియన్ బ్యాంక్, నెల్లూరు

రెప్రజెంటెడ్ బై ఇట్స్ మేనేజర్. వాది

Vs

Md.రఫీ అహ్మద్ ప్రతివాది

To, Md.రఫీ అహ్మద్, S/o S.A. జలీల్, 16/342, సోమశేఖర పురం నెల్లూరు టవున్ & జిల్లా

**నోటీసు**

పై నంబరున వాది బాకీ రాబట్టుకొను నిమిత్తము మీ మీద దావా వేసి ఉన్నందున మీకు నోటీసు నిమిత్తము 4-11-93తేదికి వాయిదా వేసి ఉన్నది. ఆ రోజు పగలు గం.10.30ని.లకు మీరు పై కోర్టులో హాజరై మీ ఆక్షేపణలను తెలుపు కొనని యెడల మీ పరోక్షమందు కేసు తీర్మానించబడును.

కొండూరు శేషారెడ్డి
వాది తరపు వకీలు

## కావలి సబ్ జడ్జి కోర్టులో

O.S. 36 / 68

వై. చూడామణి -వాది

ఓ.ఎమ్. గోపాల రావు -ప్రతివాది

**రీ సవర్ నేది ఫ కే షన్**

ఈ క్రింది షెడ్యూలు దాఖలా స్థిరాస్తి 17.10.93 తేదిన రిశీవరుచే కావలి అడ్వొకేట్సు Associdot వద్ద మధ్యాహ్నం 3 గంటలకు బహిరంగ యాలం జరుపబడును. పాట పరత్తులు రిశీవరు వద్ద తెలుసు కోవలయును.

**షెడ్యూలు**

నెల్లూరు రి.డి. కావలి సబ్ డి. కావలి గ్రామం. కావలి మున్సిపల్ యేరియా లెక డాక్టరు క్రిష్ణస్వామి గారి స్థలం 11 వ వార్డు 100 అంకణములు హద్దులు:

తూ: కాటంరెడ్డి వెంకురామిరెడ్డి స్థలం; ద: డొంక రోడ్డు; ప: చాట్ల లక్ష్మయ్య భూమి; ఉ: రోడ్డు;

N.B.: పై ఆస్తి యందు మున్సిపల్ రివిన్యూ టాక్సులు బాకీ యుండును. గవర్నమెంటు పాట రూ. 75,000/-

దర్శల శ్రీనివాస మూర్తి
అడ్వొకేటు రిశీవరు, కావలి

# శివారెడ్డి పద్యాలు

### ఇద్దరు మంత్రులు

పసల పెంచలయ్యఫస్ట్లను మనవాతే
కవికి దగ్గరోడు కలిక సైతం
అరక్షణంలో మంత్రులైరి యిద్దరు
పవరు కాస్త తేర పదవి యొకటె!

### చదువుకున్న భార్య

చదువుకున్న భార్య సంపన్నురాలైతే
వేరె స్వర్గమింక వెదక బల్ల
గండగత్తెరైతే గయ్యాళి గంపైతె
వేరెనరక మింక వెదక బల్ల!

### కవులు కొంత మంది

కవులుకొంతమంది గ్రంథాలు రచియిస్తె
వదల బుద్ధి కాదు చదవ కుండ
కవులుకొంతమంది గ్రంథాలు విరచిస్తె
చదవ బుద్ధి కాదు వదలకుండ!

### పుట్టించిన భగవంతుడు

పుట్టించిన భగవంతుడు
పెట్టక పోతాడ తిండి. పేదరికము ఏ
చట్టాల వల్ల పోదుర
ముట్టుకొకుపరులసొత్తుమూచూడకురా!

ప్రైమినిస్టరౌత పద్దినాల్గొ నేను
ప్రతిది చీల్చి మీకు పంచి బెడత
కూలినాల్ని తృటిలొ కోటీశ్వరుల జేస్త
తిరుగులేదు కవిని తీర్పు యిస్తె!

## కార్పొరేషన్

( మొదటి పేజీ తరువాయి)

లభించడంతో శ్రీమతి రత్నకుమారి, వేదవ్యాస్ ప్రభృతులు బుసలు కొడ్తున్నారు. తూర్పు గోదావరి జిల్లాలో పెద కాపు పంతం పద్మనాభం శాసన సభ్యత్వానికి రాజీనామా చేసి కాంగ్రెస్ పార్టీకి దూరం కావాలని నిర్ణయించుకున్నారు. ముఖ్యమంత్రి వైఖరికి నిరసనగా నిన్నటిదాకా ప్రత్యర్థులుగా వున్న పంతం పద్మనాభం, ముద్రగడ పద్మనాభం చేతులు కలపటంతో కోస్తా తీరంలో కాపుల ఐక్యతకు నాంది జరిగింది. అలాగే కమ్మ కులస్తులు కూడా తమకు తక్కువ ప్రాధాన్యం లభించిందని కష్టంగా వున్నారు. నివురుగప్పిన ఈ అసమ్మతి నిప్పును చల్లార్చటానికి కోట్ల వారు శతవిధాలా ప్రయత్నిస్తున్నప్పటికీ పరిస్థితి చూస్తుంటే సాధ్యం కాదేమో నన్న అనుమానం కలుగుతోంది. మంత్రి వర్గ విస్తరణ చేయకుండా వున్నా బాగుండు అని ముఖ్యమంత్రి వర్గీయులే చెవులు కొరుక్కుంటున్నా రంటే పరిస్థితి ఎంతగా వేజారి పోయిందో అర్థం చేసుకోవచ్చు.

### అసమ్మతి నీడ — కాంగ్రెస్‌కు పీడ

రాష్ట్రమంత్రి వర్గ విస్తరణ తర్వాత చెలరేగిన అసమ్మతి కాంగ్రెస్ పార్టీకి పీడలా తయారైంది. మరో ఏడాదిలో ఎన్నికలకు సమాయత్తం కావల్సి వున్న తరుణంలో రాష్ట్ర కాంగ్రెస్‌లోని అసమ్మతి భూతం ముఖ్యమంత్రి కోట్ల వారి కోటను చుట్టు ముట్టి అనూహ్యమైన పరిణామాలకు దారి తీయవచ్చని రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు. నూతన మంత్రి వర్గంలో అన్ని వర్గాల వారికి, కులాల వారికి జాగ్రత్త గానే పద్దింపులు చేసినప్పటికీ కుల పెద్దలను విస్మరించి చిన్నా చితక నాయకులను మంత్రి వర్గంలో తీసుకోవటం వల్ల సమస్య మొదలైంది. మంత్రి వర్గంలో ముఖ్యమంత్రి కులస్థుల సంఖ్య, అందరి కంటే ఎక్కువగా వున్నప్పటికీ అసెంబ్లీలో తమ కులస్తుల సంఖ్యతో పోలిస్తే లభించిన మంత్రి పదవులు చాలా తక్కువన్న భావం ఆ కులస్తుల్లో వుంది. మంత్రి వర్గ విస్తరణలో కోట్ల మార్కును ప్రస్ఫుటంగా ప్రతిఫలింప చేస్తానన్న ముఖ్యమంత్రి, వత్తిడులకు లొంగిపోయి అనుకున్నది చేయలేక పోవటం కూడా అసమ్మతి తీవ్ర రూపం దాల్చటానికి మరో కారణం. ముఖ్యమంత్రి ధైర్యంగా పాత మంత్రుల్లో పాత ముద్ర వున్న వారిని తొలగించి తన భక్తుల్ని మంత్రి వర్గంలోకి తీసుకొని వుంటే పరిస్థితి మరోలా వుండేది. పిసిసి అధ్యక్షుడు మట్టి తులసీదాస్‌తో పాటు పార్టీలో కాపు వెనుకబడిన తరగతులు ముఖ్యమంత్రి వైఖరిని తూర్పారా పట్టే పరిస్థితి నెలకొనడానికి ముఖ్యమంత్రి బలహీనతే ప్రధాన కారణం.

నిన్నగాక మొన్న రాష్ట్ర ప్రభుత్వాన్ని, ముఖ్యమంత్రిని ఘాటుగా విమర్శించిన వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి ఒత్తిడికి లొంగి ముఖ్యమంత్రి వై.ఎస్. వర్గీయుల్లో నలుగురికి స్థానం కల్పించారు. అలాగే మున్సిపల్ మంత్రి నరసింహా రెడ్డిని, పసల పెంచలయ్యను తొలగించాలని నిర్ణయించి కూడా చివరి నిముషంలో ఆ ప్రయత్నాన్ని విరమించు కున్నారు. అలాగే రఘువీరా రెడ్డిని, నర్సింగ రావును చివరి క్షణంలో మంత్రి వర్గంలోకి తీసుకోవాల్సి వచ్చింది. సుమారు పది మందిని మంత్రి వర్గం నుంచి తొలగిస్తానని తన అంతరంగికులతో చెప్పిన ముఖ్యమంత్రి కేవలం నలుగురితోనే తృప్తి పడాల్సి వచ్చింది. ఈ నలుగురు కూడా జనార్థన రెడ్డి మంత్రి వర్గంలో వున్న వారే. కానీ వీరిపై తీవ్ర విమర్శలేమీ లేవు. కోట్ల క్యాబినెట్‌లో అవినీతి మంత్రుల గుంపు వుందని వై.ఎస్. చేసిన విమర్శ కేవలం ఈ నలుగురు మంత్రులకే వర్తిస్తుందా? ఇప్పుడున్న మంత్రుల్లో కూడా చాలా మంది పై అవినీతి ఆరోపణ లున్నాయి కదా? ఈ నలుగురేం పాపం చేశారు? అన్నది చర్చనీయాంశంగా మారింది.

## జనవాణి

(3 పేజీ తరువాయి)

ఆలోచించండి? ఈ కాలనీలో చూద్దామన్నా ఒక్క రోడ్డు లేదు. డ్రైనేజి కాల్వలేదు. వర్షాకాలం మడుగుల్లో, నిత్యం దోమల బాధతో సహవాసం చేయడం పరిపాటై పోయింది. ఎన్నిసార్లు విన్నవించినా పనుల గూర్చి పట్టించుకొన్న నాథుడే లేడు; పన్నుల రశీదు పుస్తకాలు తీసుకొని మాత్రం రోజూ వస్తున్నారు.

నెల్లూరు —ఈపూరు వెంకురెడ్డి

### వివేకానందుడి విగ్రహం పెట్టాలి

టౌన్ పలుపురు నాయకుల శిలా విగ్రహాలతో తులతూగుతుంది. దేశం కోసం త్యాగాలు చేసిన నాయకులను నేటి తరం తలవడం మానినా, విగ్రహాలను చూసైనా విగ్రహాల్లో వున్న వారు త్యాగ ధనులన్న విషయం తప్పక గుర్తుకు వస్తుంది. టౌన్‌లో దరిదాపులు అందరి నాయకుల విగ్రహాలు పెట్టేందుకు ఏదో ఒక చోటు రిజర్వేషన్ అయి వుంది. కాని భారతీయ తత్వాన్ని ప్రపంచానికి చాటిన వివేకానందుడికి చోటు దొరికినట్లు లేదు. అందువల్ల రామలింగాపురం సెంటర్‌లో ఆ మహానుభావుడి విగ్రహం పెడితే సార్థకత చేకూరుతుంది.

నెల్లూరు —వాస్తు రామచంద్ర

### యానాదిరెడ్డికి అభినందనలు

జిల్లాలో సీనియర్ శాసన సభ్యులు శ్రీ కలికి యానాదిరెడ్డి మంత్రిగా నియమితులు కావడం హర్షించ తగ్గ పరిణామం. ప్రజా జీవితంలో వున్న ఆయన జిల్లా సమస్యల పరిష్కారానికి చిత్త శుద్ధితో కృషి చేయాలి.

—సి.సి. సుబ్బారాయుడు శెట్టి,
వొమ్మిన సుబ్రహ్మణ్యం
నెల్లూరు

### కలెక్టర్‌కు కృతజ్ఞతలు

టౌన్‌లో అభివృద్ధి చెందుతున్న ప్రాంతాలైన బాలాజీనగర్, ఎసినగర్, ఎన్.టి.ఆర్. నగర్ వాసులు గత కొన్నేళ్లుగా టౌన్ బస్సులు లేకుండా పడుతున్న పాట్లు వర్ణనాతీతం. ఈ విషయాన్ని యువ చైతన్య యూత్ అసోసియేషన్ వారు పలుసార్లు కలెక్టర్ దృష్టికి తీసుక పోగా ఆయన స్పందించి ఆర్టీవోకి చెప్పి బస్సు వేయించారు. రోజూ బాలాజీనగర్ మీదుగా పది ట్రిప్పులు తిరిగే ఈ బస్సును ప్రజలు వినియోగించు కోవాలి.

— యువ చైతన్య యూత్ అసోసియేషన్
నెల్లూరు

### సెక్స్ సీన్లు అవసరం

ఐడియల్ మ్యారేజ్ అనబడే సినిమాలో సెక్స్ సీన్లు అవసరం. ఆ సినిమాలో యివ్వబడిన సూచనల మూలంగా దాంపత్య సమస్యలకు లోనైన దంపతులు యెంతో మంది తమ జీవితాలను ఆనంద దాయకం చేసుకునే అవకాశ ముందని సెక్సాలజిస్టుల అభిప్రాయం. అత్యంత నైపుణ్యంగా ప్రదర్శింప బడిన ఆ సూచనలను గ్రహించ గలిగిన వాళ్లెవరూ "నరాల బలహీనతలకు ఉద్దేశింప బడిన మందుల"ను వాడరు. మనదేశంలో అన్ని భాషలలోనూ అలాంటి సినిమాలు తీసి ప్రదర్శించ గలిగితే అలాంటి మందులను తయారు చేసే ఫార్మసూటికల్ కంపెనీలకు నష్టం కలగడం తథ్యం. అలాంటి సినిమాలకు వ్యతిరేకంగా స్త్రీలు వుద్యమాలు చేబడితే, ప్రజల అజ్ఞానాన్ని, అమాయకత్వాన్ని వుపయోగించుకుని కోట్లు గడించే వ్యక్తులకు సహాయ పడడమే అవుతుంది.

నెల్లూరు —డాక్టర్ ఐ. రాజగోపాల రెడ్డి

## తిరుగుబాటు

( మొదటి పేజీ తరువాయి)

రాలేదు. ఏమి జరిగిందో తెలుసుకుందామని డిఎల్ రవీంద్రరెడ్డి వంటివారు వెళితే సరైన సమాధానం చెప్పలేదు. ముద్రగడననుసరించి మరికొందరు కోస్తా జిల్లాల ఎమ్మెల్యేలు కూడా వైఎస్ పట్ల తమ రుసరుసలను బహిరంగం గానే వ్యక్తం చేస్తున్నారు. మంత్రి వర్గ విస్తరణ సమయంలో పేర్లివ్వమని కోట్ల అడిగితే - తమ పేర్లు ఇవ్వక పోవడమే ఈ అలుకకు కారణం. పెద్ద పెద్ద హంకారాలు చేసి, సిఎంతో సంభాషణలు జరిపి, ఆర్భాటం సృష్టించి చివరకు నలుగురంటే నలుగురికి మాత్రమే మంత్రిత్వాలిప్పించడం ఈ అసమ్మతికి ప్రేరణ. ఆ నలుగురిలో తన పేరు లేదంటే, వైఎస్ దగ్గర తన స్థానం ఐదోదేనని అర్థం కదా ప్రతి ఒక్కరూ ప్రశ్నించుకుంటున్నారు.. వెనుకబడిన తరగతులకు అటు కోట్ల, ఇటు వైఎస్‌లు ఇరువురూ అన్యాయం చేశారన్నది బిసి నాయకుల విమర్శ. వీళ్లను నమ్ముకుంటే తమ గతి ఎప్పటికైనా ఇంతేనని, అందువల్ల బిసి కులోద్ధారకులైన చిరంజీవిని రంగంలోకి దింపి తీరాలని వీరు పంతం పట్టి వున్నారు. మద్రాసుకు, హైదరాబాదుకు మధ్య చెడ తిరుగుతున్నారు. ఈ హఠాత్పరిణామాన్ని వైఎస్ ఎట్లా జీర్ణించుకుంటాడో చూడాలి.

## పంచాంగము

### వినాయక చతుర్థి

తేది 19 ఆదివారము వినాయక చతుర్థి

### సెప్టెంబరు తిథులు

నిజ భాద్రపద శుద్ధ

| | | |
|---|---|---|
| తే 18 శని | తదియ | రా.గ. 2.10 వ |
| తే 19 ఆది | చతుర్థి | రా.గ. 12.00 వ |
| తే 20 సోమ | పంచమి | రా.గ. 9.50 వ |
| తే 21 మంగళ | షష్టి | రా.గ. 8.00 వ |
| తే 22 బుధ | సప్తమి | రా.గ. 6.35 వ |
| తే 23 గురు | అష్టమి | రా.గ. 5.30 వ |
| తే 24 శుక్ర | నవమి | సా.గ. 4.25 వ |

స్వయంపాకుల శ్రీనివాసులు



కొత్తదంపతులకు రోజా పూలమాలలు వేసి శుభాకాంక్షలు చెప్తున్న కోవూరు ఎమ్మెల్యే నల్లపురెడ్డి ప్రసన్నకుమార్ రెడ్డి.

# నాగార్జున డబుల్ రోల్!

జ

"అక్టోబర్ నుంచి ఫిబ్రవరి వరకు షూటింగ్ ప్లాన్ చేశాం," అన్నారు ఛాయాగ్రాహకుడు ఎస్.గోపాల రెడ్డి. ఈయన సమర్పణలో దుర్గా ఆర్ట్స్ నిర్మించే చిత్రంలో ద్విపాత్రలు నిర్వహించే నాగార్జున సరసన రోజా, సౌందర్య నాయికలు. వైవిధ్యమైన ద్విపాత్రలు నిర్వహించాలనే నాగార్జున కోర్కె ఇంతకాలానికి నెరవేర బోతోంది.

## నటి కాంచన తల్లిపై దౌర్జన్యం

మద్రాసు త్యాగరాయనగర్ గిరిరోడ్‌లో మాజీ రాష్ట్రపతి స్వర్గీయ వి.వి. గిరి భవంతి పక్కనే నటి కాంచన, ఆమె తండ్రి పి.ఆర్.కె. శాస్త్రి, తల్లి, చెల్లెలు, తమ్ముడు ఉంటున్నారు. ఆమె తల్లి ఇటీవల స్థానిక వెంకటేశ్వర ఆలయంలో గీతా పారాయణం ఆలకించి, ఇంటికి తిరిగి వస్తున్న ఆటో రిక్షాలోకి ఇద్దరు యువకులు బలవంతంగా ప్రవేశించారట. ఆ ఆటో గిరిరోడ్ దాటి ఎగ్మోర్ దిశగా వెళ్తుండడం గమనించిన కాంచన తల్లి గాభరా పడింది. ఇంతలో ఆటోలో ఉన్న యువకులు కత్తులతో బెదిరించి, ఆమె హ్యాండ్ బ్యాగ్‌లోని 300 రూపాయల రొక్కాన్ని కాజేశారట. అంతే కాక ఆమె చేత కొన్ని తెల్లకాగితాల మీద సంతకాలు పెట్టించు కున్నారట. హఠాత్తుగా ఆమె చేతికి ఒక యువతి ఏదో ఇంజక్షన్ ఇచ్చేసరికి ఆమెకు మైకం కమ్మింది. ఆమెకు స్పృహ వచ్చేసరికి ఎగ్మోర్ స్టేషన్‌లో మధురై వెళ్లే ఎక్స్‌ప్రెస్‌లో తను ఉన్నట్లు తెలుసు కుంది. తీరా బండి బయలుదేరబోయే సమయంలో ఆమె చివాలున ఆ బండిలోంచి దూకి, ఎదురుగా ఉన్న స్టేషన్ మాస్టర్ గదిలోకి వెళ్ళి, తన ఇంటికి ఫోన్ చేసి, భర్తను పిలిపించుకుంది. "మా ఆవిడ నెల్లూరులోని సంపన్నుల కుటుంబానికి చెందింది. ఆమె పేర మద్రాసులో, ఆంధ్రరాష్ట్రంలో కోటిన్నరకు పైగా ఆస్తిపాస్తులున్నాయి. ఇదేదో పథకం ప్రకారం జరిగిన కుట్రలా ఉంది," అంటూ శాస్త్రి పాండీబజార్ స్టేషన్‌లో ఫిర్యాదు చేశారు. దర్యాప్తు జరుగుతోంది.

## మద్రాసు సినిమా వార్తలు

## తెలిసి చేసిన తప్పు

"ఈ సినిమా వాళ్ల తీరే అంత," అంది గౌతమి బాధతో "ఏం జరిగింది?"

"నేను 'బందిపోటు' చిత్రంలో కాస్త గ్లామరస్ దుస్తుల్లో ఒకే ఒక డ్యాన్స్ సీన్‌లో పాల్గొనడం పెద్ద సమస్య తెచ్చి పెట్టిందండీ. అదే విధంగా తమ చిత్రాలలో ఒక డ్యాన్స్ చేయమని చాలా మంది అడుగుతున్నారు. అలా చేయడానికి నేనేమైనా డిస్కో శాంతినా ? ఇటుపైన హీరోయిన్‌గా బుక్ చేస్తే, అవసరం ఉంటే అలాంటి డాన్స్ చేయడం గురించి ఆలోచిస్తాను గాని, గెస్ట్ పాత్రలో వచ్చినా చేయను," అంది గౌతమి.

## విడాకులిచ్చిన భర్త చిత్రంలో నటిస్తున్న రాధిక

"నేను దర్శకత్వం వహించబోయే కొత్త తమిళ చిత్రం 'శివలప్పింపాండి'లో నాయిక పాత్ర అతి క్లిష్టమైనది. రాధిక ఒక్కటే ఆ పాత్రకు న్యాయం చేకూర్చగలదు. 1982లో వివాహం చేసుకున్న మేము 1983లో విడిపోయాం కనుక, ఆమె నా దర్శకత్వంలో నటించడానికి ఒప్పుకుంటుందా అని సందేహించాను. అయినా, ఆమెకు ఫోన్ చేసి ఈ విషయం చెప్పాను. ఒక నటిని డైరెక్టర్ కాల్‌షీట్లు అడిగినట్లు అడిగాను. ఆమె ఓకే అంది. రియల్లీ షి ఈజ్ ఎ

కొరవ 10 పేజీలో

# కాళిదాసుగా ఎన్టీఆర్?

ఎన్నికల తేదీ ప్రకటించిన వెంటనే 'శ్రీ నాథ సార్వభౌముడు' చిత్రాన్ని విడుదల చేయాలని ఎన్టీఆర్ తలపోస్తున్నారట. ఇలాచేస్తే రాజకీయంగా తనకు కలిసి వస్తుందని. ఆ తర్వాత లానే, ముఖ్యపాత్ర ధారిగా మళ్ళీ బాపు రమణల కాంబినేషన్‌లో 'మహాకవి కాళిదాసు' చిత్రాన్ని రూపొందించాలని ఆలోచనలో వున్నారట. గతంలో ఆ చిత్రం నాగేశ్వర రావుతో కమలాకర కామేశ్వర రావు దర్శకత్వంలో వెలువడిన విషయం ప్రేక్షకులకు గుర్తుండే ఉంటుంది.

## అక్టోబర్ 1న "అల్లరి అల్లుడు"

ట

నెల్లూరీయుడు ఎ. కోదండరామి రెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో డి. శివప్రసాద్ రెడ్డి నిర్మించిన కామాక్షి ఆర్ట్స్ "అల్లరి అల్లుడు" చిత్రాన్ని అక్టోబరు 1న విడుదల చేయడానికి సన్నాహాలు జరుగుతున్నాయి. నాగార్జున, మీనా, నగ్మా, వాణిశ్రీ, రావుగోపాల రావు, కోట శ్రీనివాస రావు, బ్రహ్మానందం, బాబూ మోహన్, చలపతిరావు పాత్రధారులు. సంగీతం:కీరవాణి.

# నిప్పు రవ్వ - నిజంగా నిప్పు రవ్వే!

## చిత్రసమీక్ష

గ్రిద్దలూరు: గోపాలరావు

"నిప్పురవ్వ" అని పేరు పెట్టుకున్న ఈ చిత్రంలో చాలా నిప్పురవ్వ లున్నాయి. ఇన్ని నిప్పురవ్వలు ఏ విధంగా వచ్చాయన్న' ఆలోచన చిత్రం చూస్తున్న ప్రేక్షకులకు రావచ్చు.

పరుచూరు సోదరులు వ్రాసిన కథ చాలా చాలా పాతది. ఎలాంటి పాతది అంటే త్రుప్పుపట్టిన ఇనుప ముక్కలాంటిది.

బొగ్గు గనుల్లో పని చేసే కార్మికుల జీవితం ఈ కథ. సూర్యం(బాలకృష్ణ) అనే కార్మికుడు వీళ్ళ నాయకుడు. గని యజమాని ధనరాజ్ (అమ్రిష్‌పూరి)నిరంకుశుడు. కార్మికుల సమస్యల పరిష్కారం కోసం సూర్యం, ధనరాజ్‌తో పోరాటం సాగిస్తాడు. ఇలా సాగుతున్న కథ రాజకీయ రొచ్చులోకి, పోలీస అవినీతిలోకి చొచ్చుకుంటుంది. దీనితో ధనరాజ్‌కు పోలీస్ బలం, కార్మిక మంత్రి అండ సమకూరుతాయి. వీటన్నిటినీ ఛేదించి సూర్యం ధనరాజ్‌ను, ఆయన మురాసు హతమారుస్తాడు.

తుప్పు పట్టిన కథను అలాగే చూపితే ముఖం మొత్తుతుందని భావించిన దర్శకుడు ఎ.కోదండరామి రెడ్డి ఆ తుప్పు వదిలించదలిచాడు. ఇనుప ముక్క తుప్పు వదిలించెందుకు కొలిమిలో పెట్టి కాల్చినట్టుగా, ఈ కథను కొలిమిలో పెట్టి బొగ్గు గనిలోని బొగ్గులతో ఎర్రగా కాల్చాడు. తన మేధస్సు అనే సమ్మెటతో దెబ్బలు కొట్టాడు. ఆ సమ్మెట వేటుకు కణకణ కాలిన కథనుంచి చాలా నిప్పురవ్వలు రేగాయి. నలుదిక్కులకూ విరజిమ్మాయి. అందులో మొదటిది, పెద్దది అయిన నిప్పురవ్వ సూర్యం అనే కార్మిక నాయకుడు. ఈ నిప్పురవ్వ చురుగ్గా, కరుగ్గా దూసుకపోయి, సామాజిక జీవితాన్ని అంధకారంలో ముంచుతున్న స్వార్థాన్ని, అవినీతిని, అధికార దుర్వినియోగాన్ని, రాజకీయ దౌర్జన్యాన్ని చీల్చి చెండాడింది. గొప్ప తెలుగు సినిమా హీరోగా పేరు పొందింది.

మరొక నిప్పురవ్వ నీతి, నిజాయితీకి ప్రతిరూపమైన ఒక యస్.పి (లక్ష్మి)లో పరకాయ ప్రవేశం చేస్తుంది. ఈ నిప్పురవ్వ, హాలాహలాన్నయినా మ్రింగుతుంది కాని ఉద్యోగ ధర్మం, ఆత్మాభిమానం దెబ్బతింటే సుతరామూ సహించదు. అందుకే సూర్యానికి వెన్నుముకగా నిలిచి అన్యాయాన్ని అక్రమాన్ని అదర గొట్టుంది.

ఇంకొక నిప్పురవ్వ విజయన్ నిర్వహణలో, దారుణ పరిస్థితులను ఎదుర్కొనే స్థైర్యం పొంది ధైర్యంగా ఫైటింగులు చేసి నిరంకుశత్వాన్ని గట్టిగా దెబ్బతీస్తుంది. చిత్రంలో చాలా చోట్ల ప్రతీకారాగ్ని జ్వాలగా ఈ నిప్పురవ్వ ప్రత్యక్షమై హీరో సూర్యంకు పెద్ద పేరు తెస్తుంది. ఏక్షన్ సీన్ల కోసం ఆశగా ఎదురు చూసే ప్రేక్షకులను

కొరవ 10 పేజీలో

## నెల్లూరు సబ్ జడ్జి కోర్టులో

SC 363/91

సిండికేటు బ్యాంకు, దర్గామిట్ట, నెల్లూరు - వాది

Vs

1. కొండూరు మురళీధర్ వగైరా - ప్రతివాదులు

To

1. కొండూరు మురళీధర్
S/o కృష్ణమూర్తి, పోలీసు కానిస్టేబులు
PC No. 533
III Town Police Station, Nellore

పై నంబరు దావాలో వాది ప్రతివాదులగు మీమీద దావా వేసినందున మీ ఆక్షేపణల నిమిత్తం 28-10-93 వాయిదా వేసి వున్నారు. ఆ దినం మీరు గాని మీ తరపు వకీలు గాని హాజరయి ఆక్షేపణలు తెలుపకున్న దావా మీ పరోక్షంలో తీర్మానించ బడును.

ఎమ్. రవీంద్ర రెడ్డి
వాది తరపు వకీలు

---

## BEFORE THE COURT OF COMMISSIONER FOR WORKMEN'S COMPENSATION CUM DY COMMISSIONER

FOR LABOUR : R.R.DISTRICT ZONE : 8th FLOOR, CHANDRAVIHAR : NAMPALLY : HYDERABAD

W.C. No. 177 of 1990

Between :

V. Dhanunjaiah Reddy & Other - Applicants

And

Surender Reddy & another Opposite Parties

To

Surender Reddy
S/o Chinna Reddy
R/o Narukoor Road
Nawab pet, Nellore

Please take notice that the above applicants have filed a case against both of you for grant of compensation for the death of their daughter who died in a motor vehicle accident occured on 20.8.90 under the limits of P.S. Kukatapalli while she was on your duty. The above case is posted to 23.9.93 at 3 PM for your appearance and counter if any. If you fail to appear before this court on this above date and time this case will be decided exparte.

(BY ORDER OF THE COURT)

**P.Sudheer and A.V.Appa Rao**
Counsel for applicants
H.No. 16-2-145/8/3
Malakpet Palton, Hyderabad

---

## చెల్లనేరదు

నెల్లూరు టౌన్, కాపువీధి, ఆనం వారి సందు కాపురస్తురాలైన విమ్మల శ్యామల భర్త శేషయ్యగారు అయిన నేను యావన్మందికి అందుమూలముగా తెలియ జేయుత మేమనగా - మేము కాపురముంటున్న 14/164 డోర నెంబరు గల ఇల్లు వాస్వార్జితము. దాని మీద ఇతరులు ఎవ్వరికీ ఏలాంటి హక్కు, అనుభవం లేదు.

దానిని ఎవ్వరు అమ్మడం గాని, అదు మానముంచుటకు గాని, ఇతర విధము లైన అన్యాక్రాంతములు చేయుటకు గాని హక్కులేదు. అట్లు ధిక్కరించి ఎవరైనా చేసినచో నన్ను గాని సదరు ఆస్తిని గాని బద్ధగించవు. అట్లు చేసిన అది చెల్లనేరదు.

ఎస్. శ్యామల

---

## డిస్ట్రిక్టు మునసబు కోర్టు, వెంకటగిరి

IA No. 88/93
OS No. 120/88

షేక్ ఖాదర్ సాహెబ్ - ప్ర.డి.హో - పిటిషనరు

షేక్ కాలిషా సాహెబ్, S/o ఖాదర్ సాహెబ్, ఓబులాయపల్లి, ఆకిలివలస మజరా, పెనుబర్తి పోస్టు, రాపూరు మండలం - జె.డి. - రెస్పాండెంటు

పత్రికా ప్రకటన ద్వారా రెస్పాండెంటుకు నోటీసు

పై నెం. దరఖాస్తు ఫైనల్ డిక్రీ ఇవ్వవలసినదిగా కోరుచూ వేయబడినది వాయిదా 5-10-93 తేది మంగళ వారం ఆక్షేపణలున్న తెలుపు కొనవల యును. లేని యెడల పరోక్షములో తీర్మా నించబడునని తెలియపరచడమైనది.

వెంకటగిరి. **సత్యనారాయణశెట్టి**
12.8.93. పిటిషనర్ న్యాయవాది

---

## గూడూరు డి.ము. కోర్టులో

EP 10/90 : OS 318/86

1. C. Anil Kumar (died)
2. C. Mehar Mani
3. C. Sri Chytanya
4. C. Gayathri

3 and 4 being minors represented by mother and guardian No 2 - D.Hr.

Vs

Patan Rahamthulla Khan - J.Dr.

**SALE NOTICE**

పై EPషెడ్యూలు దాఖలా ఆస్తిని J.dr వేలం నోటీసు నిమిత్తం 6-10-93వ తేదికి వాయిదా వేసి వున్నది. ఆ రోజున ఉదయం 10-30ని.లకు J.dr స్వయముగా గాని, వకీలు ద్వారా గాని హాజరు కావలెను. లేని యెడల Exparte చేసెదరు.

**P.N. Madan Mohan**
**K.Venkata Krishnaiah**
Advocates for D.Hr.Gudur.

---

## సమీక్ష

(9 పేజీ కొరవ)

ఉత్సాహాన్ని ఉల్లాసాన్ని కలిగిస్తుంది మరొక నిప్పురవ్వ తార దగ్గర నృత్యం నేర్చుకొని, వేటూరి, సీతారామ శాస్త్రి పాటలను జత చేసుకొని బాలసుబ్రహ్మణ్యం చిత్రాల గళస్వరం అరువు తీసుకొని కళామ తల్లి ముద్దు బిడ్డలా ముగ్ధ మోహన రూపంలో రసగంగా ఝురి వినిపిస్తూ కథానాయక, నాయికలను కలబోసి, స్వదేశంలోనే కాదు, విదేశాలలో కూడా ప్రకృతి దృశ్యాలను పలుకరించి, విలాస నగరాల్లో విహరించి, హృద్యంగా నృత్యంచేసి ప్రేక్షకులను ఊరించి, ఊగించి మైమరపించింది. ఈ సంగీత, నృత్య పరిమళాలకు మంత్ర ముగ్ధ అయిన ఒక నిప్పురవ్వ సరసన యస్.గోపాల రెడ్డి కెమరాలో దూరి నృత్య దృశ్యాలకు సుందర సుకుమార్ రూపాన్ని తీర్చిదిద్దింది.

ఒక నిప్పురవ్వ కణకణ రగులుతూ దర్శకుని మేధస్సుకు వేడెక్కించింది. చిత్రంలో చాలా సన్నివేశాలను సుసంపన్నం చేసింది. ముఖ్యంగా బొగ్గు గనిలో నీటి ప్రమాదంలో చిక్కుకున్న కార్మికులను హీరో సూర్యం కాపాడిన దృశ్యాలు, చిత్రం ప్రారంభంలో హీరో జైలునుంచి తప్పించుకున్న సాహస దృశ్యం, పెద్ద జనసందోహంతో నడిచిన కార్మిక ఉద్యమం యిలా ఇంకా కొన్ని సన్నివేశాలు ఒకదాని వెంట ఒకటి ఒకదానిని మించి మరొకటి ఎత్తుగా, పటుత్వంగా కుదిరాయి.

కత్తి మంచీ చేస్తుంది చెడ్డా చేస్తుంది. వంట వాని చేతిలో కత్తి కూరలు తరుగుతుంది. హంతకుని చేతిలోని కత్తి తలలు నరుకుతుంది. అలాగే ఇంత వరకు మంచి వారిచేతిలో పడ్డ నిప్పురవ్వలు మంచిని తలపెట్టాయి. మంచిని చేశాయి. మంచిని పెంచాయి. ఇప్పుడు బొగ్గు గని యజమాని ధనరాజ్ కర్కశ హస్తాల్లో చిక్కుకున్న నిప్పురవ్వ కార్మికుల రక్తం పీల్చింది. న్యాయం కోసం పోరాడిన హీరో సూర్యాన్ని నానా హింసలు పెట్టింది. అలాగే కార్మిక మంత్రి (రావుగోపాల రావు) స్వార్థచింతనలో జొరబడ్డ నిప్పురవ్వ ప్రజాస్వామ్యపునాదులనే అదర గొట్టింది.

చివరన మంచి చురుకైన నిప్పురవ్వలన్నీ నిర్మాణాత్మకంగా ఏకమై విజయం సాధించాయి. ఫలితంగా, మిలమిల మెరిసే రవ్వలతో చెక్కిన కంఠహారంగా రూపుదిద్దుకుంది ''నిప్పురవ్వ'' చిత్రం.

---

## వి.ఆర్.కాలేజి

(4 పేజీ కొరవ)

చేస్తామని హామి ఇచ్చారాయన. వివేకానంద రెడ్డి సుదీర్ఘ వుపన్యాస మిచ్చారు. 117 ఏళ్ల చరిత్ర కల్గిన కాలేజి, క్రీడల్లో కుంటుపడి పోయినందువల్ల దాన్ని పునరుద్ధ రించేందుకు క్రీడోత్సవం జరుపుతున్నాము. 5 వేల మంది విద్యార్థులున్న కళాశాల సముదాయానికి ఇండోర్ స్టేడియం, జిమ్నాజియం, ఆడిటోరియం, లైబ్రరీ నిర్మించు కొనేందుకు యు.జి.సి. నిధులను వైస్ ఛాన్సలర్ శాంక్షన్ చేయించాలని కోరారాయన. ఎమ్మెల్యే జె.కె. రెడ్డి, కలెక్టర్ ఎం. సాంబశివ రావు క్రీడా పతకాలను ఆవిష్కరించారు. పోటీలప్రారంభ సూచకంగా పావురాలను ఎగురవేశారు.

బాస్కెట్ బాల్, వాలీ బాల్, ఖో–ఖో ఆటలు చూసేందుకు జనం ఎగబడ్డారు. వి.ఆర్. కళాశాల మైదానంలో చివరి రోజైన 15 తేది రాత్రి జరిగిన బాస్కెట్ బాల్ ఫైనల్ మ్యాచ్‌కు ఇసుక వేస్తే రాలనంత జనం వచ్చారు. మెక్లిన్స్‌లో జరిగిన షటిల్ బ్యాడ్‌మింటన్ రసవత్తరంగా వుండింది. ఈ పోటీల్లో వి.ఆర్.కళాశాల విద్యార్థులు రెండవ స్థానం పొందారు. బ్యాడ్‌మింటన్‌లో గూడూరు ఎస్.కె.ఆర్. కాలేజ్, టేబుల్ టెన్నిస్‌లో విద్యానగర్ ఎన్.బి.కె.ఆర్. కళాశాల విద్యార్థులు విజయం సాధించారు. చెస్‌లో వి.ఆర్. కళాశాల విద్యార్థి ఎల్.వి. శివకుమార్‌ను విజయ లక్ష్మి వరించగా, వాలీబాల్‌లో కావలి జె.బి., ఖోఖోలో సర్వోదయ విద్యార్థులు విజయాన్ని కైవసం చేసుకొన్నారు. అథ్లెటిక్స్‌లో వంద, రెండు వందల మీటర్ల పరుగు పందెం, హార్డిల్స్ లాంగ్ జంప్, ట్రిపుల్ జంప్, లలో ముజా అహమ్మద్ విజేతగా నిల్చి నెల్లూరు పేరు నిలబెట్టాడు. ఇక నుండి ఈ కుర్రాడికి చక్కని శిక్షణ నిప్పించ వలసిన బాధ్యత సర్వోదయ యాజమాన్యం పై వుంది. పలు క్రీడల్లో కడప విద్యార్థులు లక్ష్మినారాయణ, మన్సూరుద్దీన్, జిలానీ భాష, మురళి, చక్కని ప్రతిభ చూపారు.

15 తేది జరిగిన బహుమతి ప్రదానోత్సవ సభకు యూనివర్సిటీ రిజిస్ట్రార్ జయదేవ రెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేశారు. ఎస్పీ కె. కృష్ణప్రసాద్ సావనీర్‌ను ఆవిష్కరించగా, ఎమ్మెల్యే జె.కె. రెడ్డి, రిజిస్ట్రార్ విజేతలకు బహుమతు లందించారు. వచ్చే సంవత్సరం బాలికల క్రీడోత్సవానికి, ఇండోర్ స్టేడియం, జిమ్నాజియం ఏర్పాటుకు తోడ్పాటు నందిస్తానని రిజిస్ట్రార్ హామి ఇచ్చారు. మొత్తానికి వైస్ ఛాన్సలర్ దగ్గర ఎంబిఏ కోర్సు హామి, రిజిస్ట్రార్ వద్ద స్టేడియం, జిమ్నాజియం నిర్మాణానికి హామి పొందారు ఆనం సోదరద్వయం.

---

## సినిమా

(9 పేజీ కొరవ)

గ్రేట్ ఆర్టిస్ట్'' అన్నారు డైరెక్టర్ ప్రతాప్ పోతన్.

ఈ విషయం గురించి రాధిక చెప్తూ, ''ఆయన దగ్గర్నుంచి ఫోన్ వచ్చినందుకు విస్తుపోయాను. ఎంతో మంచి పాత్ర కానిదే ఆయన నాకు ఫోన్ చేయరని తెలుసు. చక్కని పాత్రను ఛాలెంజ్‌గా తీసుకొని నటించడం నా వృత్తి. అందుకే అంగీకరించాను. ఒకప్పుడు మేము భార్యా భర్తలం కావచ్చు. అప్పుడు దర్శకుడు- నటి సంబంధం. ఆయన నా మీద ఉంచిన నమ్మకాన్ని వమ్ము చేయకుండా ఆ పాత్రను పోషిస్తాను.'' అంది. నటీమణి రాధిక !

## సెప్టెంబర్ 3వ వారంలో ''కాలచక్రం''

''లండన్‌లో ఒక కుటుంబంలో జరిగిన యదార్థ సంఘటనలతో రూపొందిన చిత్రం. జయసుధ నటన ముఖ్యంగా మహిళలను విశేషంగా ఆకర్షించగలదు. సెప్టెంబర్ 3వ వారంలో విడుదల.'' అన్నారు నెల్లూరీయుడు పి.చంద్రశేఖర రెడ్డి. ఈయన దర్శకత్వం వహించిన ''కాల చక్రం'' చిత్రంలో జయసుధ, చంద్రమోహన్, రాజ్‌కుమార్, గుమ్మడి, శ్రీలత, వేలు, బ్రహ్మానందం, బాబూమోహన్, ధర్మవరపు సుబ్రహ్మణ్యం, ఆనంద్, రమాప్రభ, రేఖ, రాజేశ్వరి, విజయలక్ష్మి పాత్రధారులు. కథ:రాధాకుమారి, మాటలు: కృష్ణేశ్వర రావు, సంగీతం: వాసూరావు, ఛాయ:నవకాంత్, నిర్మాత:కుమారి పద్మ.

పి.చంద్రశేఖర రెడ్డి దర్శకత్వం వహించే ''అన్నా-వదిన'' చిత్రానికి ఇటీవల ఊటీలో రెండుపాటల చిత్రీకరణతో షూటింగ్ ముగిసినట్లే. కృష్ణంరాజు, జయప్రద, రాజ్‌కుమార్, అంజలీదేవి, లతాశ్రీ, మేనక, స్మిత, రాజేశ్వరి, పుండరీకాక్షయ్య, బాలయ్య, ఆర్హా జనార్థనరావు, బ్రహ్మానందం, బాబూమోహన్ పాత్రధారులు. కథ, మాటలు, స్క్రీన్‌ప్లే: డి.వి. నరసరాజు. గీతాలు: ఎం.ఎస్.రెడ్డి, సి.నారాయణ రెడ్డి.

## నాలుగు తెలుగు చిత్రాలలో శ్రీదేవి

ఎందుకో ఏమో ఇప్పుడు శ్రీదేవి హిందీ చిత్రాల పట్ల అంతగా ఆసక్తి చూపడం లేదు. ప్రస్తుతం ఈమె నాగార్జున సరసన వైజయంతీ మూవీస్ చిత్రంలో నటిస్తున్న విషయం పాఠకులకు తెలిసిందే. ఇది కాక 'వాల్టర్ వెట్రివేల్' తెలుగు చిత్రంలో చిరంజీవితో, శ్రీ వెంకటేశ్వర ఆర్ట్ చిత్రంలో వెంకటేష్‌తో నటించ నున్నది. కె. రాఘవేంద్ర రావు దర్శకత్వంలో కూడా ఒక చిత్రంలో బుక్ కావచ్చు.

---

## ది నెల్లూరు పర్మినెంటు ఫండ్ లి. — నెల్లూరు

నెల్లూరు పర్మినెంటు ఫండు లిమిటెడ్ వారు 11.9.93 తేదిన జరిపిన సాంవత్సరిక సమావేశములో 1.4.92 మొదలు 31.3.93 వరకు ఫండుతో లావా దేవి జరిపిన షేరు హోల్డరకు వారికున్న షేర్లకు రూపాయి ఒకటికి డెబ్బై అయిదు పైసలు డివిడెండు యివ్వునట్లు తీర్మానము చేసినారు.

చివుకుల సత్యనారాయణ మూర్తి
సెక్రటరీ

## కీర్తి పతాక

(2 పేజీ తరువాయి)

మొదట పిఎస్ఎల్వి ద్వారా ఒక టన్ను బరువున్న ఉపగ్రహాన్ని భూమికి 900 కిలో మీటర్ల దూరంలోని కక్ష్యలో ప్రవేశపెట్టాలని తలపెట్టారు. కాని ప్రథమ ప్రయత్నం విఫలం కాకూడదనే జాగ్రత్తతో తర్వాత ఉపగ్రహం బరువును 150 కిలోలు తగ్గించి, కక్ష్యను భూమికి సమీపంలోకి తెచ్చారు. రానున్న 7 సంవత్సరాలలో మరొక ఆరు పిఎస్ఎల్వి ప్రయోగాలు చేయాలన్నది లక్ష్యం. ఇవన్నీ సఫలమైతే జిఎస్ఎల్వి తరహా రాకెట్లు ప్రయోగిస్తారు. సమాచార సంబంధాల కోసం పంపే ఇన్శాట్ తరహా ఉపగ్రహాల ప్రయోగానికి జిఎస్ఎల్వి అవసరం. ఆ ఉపగ్రహాల బరువు రెండు టన్నుల వరకు వుంటుంది. వాటిని భూమికి 36 వేల కిలో మీటర్ల దూరంలోని సుదూర కక్ష్యలో ప్రవేశ పెడతారు. వివాదాస్పదమైన రష్యా క్రయోజనిక్ ఇంజన్ల సరఫరా ఒప్పందం దీనికి సంబంధించినదే.

రాకెట్లకు వాడే ఇంధనం రెండు రకాలు. ఘన రూపం, ద్రవ రూపం. ఘన రూప ఇంధనం తయారీలో మన శాస్త్రవేత్తలు పూర్తి నిపుణత సాధించారు. మిసైల్స్ తయారీలో వాడేది ఘన ఇంధనమే. రాకెట్ల ప్రయోగంలో ఘన రూప ఇంధనం వల్ల చాలా సమస్యలు తలెత్తు తున్నాయి. అన్నిటి కంటె ప్రధానమైనది బరువు. ఇప్పటి పిఎస్ఎల్విలో వాడే ఘన ఇంధనం బరువు దాదాపు 400 టన్నులు. దీనివల్ల రాకెట్ తయారీ భారీగా వుంటున్నది. అంత ఇంధనం నిల్వ చేసే కంటైనర్లు, రాకెట్లో అమర్చ వలసి వస్తున్నది. ఘన ఇంధనంతో మరొక సమస్య – ఒకసారి స్టార్ట్ చేస్తే ఇక ఆపడానికి లేదు.

ద్రవరూప ఇంధనం తేలికైనది. ఇందులోనూ రెండు రకాలు. సాధారణ గది ఉష్ణోగ్రతలో నిల్వ చేయగల్గినది. అత్యంత శీతల పరిస్థితులలో నిల్వ చేసేది. మొదటి ఇంధనం సాధారణ కంటైనర్లలో పోసి, రాకెట్కు తగిలించ వచ్చు. ఇది అంత సమర్థ వంతమైనది కాదు. ఈ ఇంధన తయారీ పరిజ్ఞానం మన శాస్త్రవేత్తలకు అబ్బింది. పిఎస్ఎల్వి చివరి రెండు దశలలో ద్రవ ఇంధనమే వాడుతున్నారు. క్రయోజనిక్ ఇంధనం లిక్విడ్ హైడ్రోజన్, లిక్విడ్ ఆక్సిజన్ల సమ్మిశ్రితంతో తయారు చేస్తారు. మొదటి పదార్థం మైనస్ 253 డిగ్రీలు, రెండవ పదార్థం మైనస్ 183 డిగ్రీల శీతల పరిస్థితిలో నిల్వచేయాలి. ఈ మిశ్రమంతో తయారు చేసే ఇంజన్ రూపకల్పన సంక్లిష్టమైనది. ఆ పరిజ్ఞానం మనకు లేదు. రష్యా నుంచి దిగుమతి వీలు కాక పోతే, దాన్ని మనంతట మనం తయారు చేసుకో వాలంటే కనీసం పదేళ్ల సమయం పడుతుందని అంచనా. పిఎస్ఎల్వి రాకెట్ల ప్రయోగానికి క్రయోజనిక్ ఇంజన్లు తప్పనిసరి. జిఎస్ఎల్వి రాకెట్లు సాగించే ఉపగ్రహాలు భూమికి [illegible] వేల కిలోమీటర్ల దూరంలో, సరిగ్గా భూమి తన చుట్టూ లాను తిరిగే కక్ష్యలో వుంటాయి. అవి భూమితో పాటే, భూమి తిరిగే వేగంతోనే తిరగడం వల్ల, ఎప్పుడూ నిలకడగా వున్నట్లు కన్పిస్తాయి. అందువల్ల భూమి పై పెట్టె అంటెన్నాలను కదిలించనవసరం లేకుండా, ఎప్పుడూ ఉపగ్రహం తిరిగే దిశే చూపు వుంచవచ్చు. అందువల్లే ఆ ఉపగ్రహాలు అత్యంత సమర్థవంతంగా పనిచేస్తాయి.

జిఎస్ఎల్విలో సఫలీకృతులమైతే – అమెరికా, రష్యా, యూరోపియన్ దేశాలకు మాత్రం పరిమితమైన డెల్టా, ఛాలెంజర్ వంటి అంతరిక్ష నౌకలను రూపొందించే పరిజ్ఞానానికి భారతదేశం దగ్గరౌతుంది. ఉపగ్రహాలలో అంతరిక్ష యాత్రికులను పంపే నైపుణ్యం సాధించ గల్గుతుంది. ఖండాంతర క్షిపణులు తయారు చేసుకో గల్గుతుంది. అంతటి శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం భారతదేశానికి అబ్బడం ఏ అభివృద్ధి చెందిన దేశానికీ ఇచ్ఛగించడం లేదు. ఆ దశకు చేరడానికి కనీసం పాతికేళ్లు పట్టినప్పటికీ మనంతట మనం ఆ నైపుణ్యం సాధించడం వారికి కడుపు మంటగా వుంది. అందుకే రష్యా ఒప్పందానికి పేచీ పెడుతున్నారు.

## నెల్లూరు సంగతులు

(4 పేజీ తరువాయి)

పూర్ణ కుంభ, మంగళ వాయిద్యాలు, వేద మంత్రముల తోటి సభా వేదికకు తోడ్కొని మారు సభకు ఎ.పి. ప్రైవేట్ ఐ.టి.ఐ.ల అసోసియేషన్ అధ్యక్షుడు రోటేరియన్ వామ్మిన సుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించారు. 70 వ దశకంలో నెల్లూరు ఐ.టి.ఐ. ప్రిన్సిపల్గా బాధ్యతలు స్వీకరించిన శ్రీ సుబ్రహ్మణ్యం అంచెలంచెలుగా పై కెదిగారు. వారి చొరవ వల్లే 90 గవర్నమెంట్, 378 ప్రైవేట్ ఐ.టి.ఐ.లు రాష్ట్రంలో స్థాపింప బడి 80 వేల మంది వృత్తి విద్యలో ప్రావీణ్యులవుతున్నారని వామ్మిన సుబ్రహ్మణ్యం చెప్పారు. ప్రస్తుత నిబంధనల వల్లప్రైవేట్ ఐ.టి.ఐ. నిర్వాహకులు నష్టపోతున్నారని అందువల్ల ఫీజులు పెంచాలని జమా, ఖర్చుల నివేదిక చదివి తన సహజ నైజం చాటారాయన. ప్రభుత్వ విప్ శ్రీ సి.వి. శేషారెడ్డి, శ్రీ ఎమ్మెల్యే జె.కె. రెడ్డి ప్రైవేట్ ఐ.టి.ఐ.ల సమస్యలు అసెంబ్లీలో మాట్లాడేస్తామని హామీ ఇచ్చారు. అనంతరం వారివురు శ్రీ సుబ్రహ్మణ్యంను దుశ్శాలువ, నిలువెత్తు మాలతో సత్కరించారు. ఐ.టి.ఐ.ల రీజనల్ డిప్యూటీ డైరక్టర్ సుబ్బయ్య, గవర్నమెంట్ ఐ.టి.ఐ. ప్రిన్సిపల్ దశరథరామయ్య వేదిక నలంకరించారు. కార్యక్రమ ప్రారంభానికి ముందు వామ్మిన సుబ్రహ్మణ్యం సురేష్ మ్యాజిక్ కార్యక్రమం మొత్తం వామ్మిన అదుపాజ్ఞలలో జరిగింది.

### ముగిసిన జేసిస్ వారోత్సవాలు

జేసిస్, జేసిరెట్, జూనియర్ జేసిస్ సంస్థలు సంయుక్తంగా 9 తేది నుంచి 15 తేది వరకు వారోత్సవాలు తమదైన బాణీలో చేశారు. 9 తేది మత సహిష్ణుతా దినం, 10 తేది భావి తరాల భవిష్యత్ దినం, 11 తేది జన్మభూమి దినం, 13 తేది సహాయ దినం, 14 తేది పర్యావరణ పరిరక్షణ దినం, 15 తేది ముగింపు దినాలు గా జరిపారు. వీటిలో భాగంగా స్కూల్ పిల్లలకు వ్యాసరచన, వక్తృత్వ, చిత్రలేఖన పోటీలు పెట్టి బహుమతులందించారు. ఒక్కొక్క ప్రదేశంలో ఒక్కొక్క కార్యక్రమం ఏర్పాటు చేయడంలో జేసిస్ అధ్యక్ష కార్యదర్శులు ఆర్. వెంకటేశ్వర్లు, బి.టి. హరికృష్ణ బాగా కష్టపడ్డారు.

### ఎల్.ఐ.సి. కొత్త పథకం 'ఆశాదీప్'

ప్రాణాంతక జబ్బులైన హార్ట్ బైపాస్ సర్జరీ, కిడ్నీల మార్పిడి, కాన్సర్ వంటి వ్యాధుల చికిత్స గూర్చిన చింత మధ్య తరగతియులకు ఇక వద్దంటున్నారు లైఫ్ ఇన్స్యూరెన్సు కార్పొరేషన్ వారు. అందుకోసమే 'ఆశాదీప్' పథకాన్ని ప్రారంభిస్తున్నట్లు డివిజనల్ మేనేజర్ సి.ఎస్. మాధవ రావు 15 తేది పత్రికల వారితో చెప్పారు. ఈ పథకంలో 50 వేల నుంచి లక్ష రూపాయల పాలసీని 18 సంవత్సరాల మొదలు 50 వయస్సున్న వారు తీసుకోవచ్చు. పాలసీ తీసుకొని సంవత్సరం గడిచాక పై ప్రాణాంతక వ్యాధులేమైనా సంక్రమిస్తే చికిత్సకు అయ్యే ఖర్చు కార్పొరేషన్ భరిస్తుంది. ఎన్నో రాయితీలూ వున్నాయి. సెప్టెంబర్ 7 నుండి నవంబర్ 30 తేది వరకు మాత్రమే ఈ పథకం మార్కెట్లో వుంటుందని ప్రజలు ఉపయోగించు కోవాలని కోరుతున్నారు.

### ఆకట్టుకొన్న 'ఊరుమ్మడి బతుకులు'

లలిత కళా సంస్థ కళామందిర్ టౌన్ హాల్లో 11వ తేది నిర్వహించిన 127వ కార్యక్రమంలో మద్రాసు కళాకారులు ప్రదర్శించిన 'ఊరుమ్మడి బతుకులు' నాటిక ప్రేక్షకులను ఆకట్టుకొంది. స్త్రీకి సమాజంలో గౌరవం, సమానత కావాలనే సందేశంతో కూడిన నాటికలో పలు వాస్తవ ఘటనలను సాక్షాత్కరింప జేసింది. సీతాలు పాత్ర పోషించిన విజయవాణి తన నటనతో ప్రేక్షకులను మంత్ర ముగ్ధులను గావించి దనడంలో అతిశయోక్తి లేదు. అనంతరం ప్రదర్శించిన సత్యహరిశ్చంద్ర నాటకంలో హరిశ్చంద్ర పాత్రధారిగా పది సంవత్సరాల బాలుడు యు.రవీంద్ర రెడ్డి చక్కని ప్రతిభ చూపాడు. అరవైఏళ్ల రాజమండ్రికి చెందిన వృద్ధ కళాకారిణి వై.ఎస్.లక్ష్మి వయసుకు గళానికి సంబంధం లేనట్లుగా చక్కని పద్యాలు పాడి చప్పట్లు మ్రోగింప జేశారు. అంతకు ముందు జరిగిన సభలో ఎమ్మెల్యే జె.కె.రెడ్డి, స్వాతి రెస్టారెంట్ అధినేతలు ఎ.శ్రీనివాసులు రెడ్డి, సి.హెచ్. చంద్రయ్య నిర్వాహకుడు దాశరథిని అభినందిస్తూ మాట్లాడారు. చివరన కళాకారులు పెండ్యాల వెంకటేశ్వర్లు, కె.నరసింహరాజు, ఎస్.వి. సుబ్బారావు, ఏగిడి సుబ్బారావులను నిర్వాహకులు సన్మానించారు.

### బాలాజీ నగర్‌కు టౌన్ బస్సు

టౌన్ బస్ కావాలని ఏళ్ల తరబడి కోరుతున్న బాలాజీ నగర్ వాసుల కోరిక చాలా రోజుల తరువాత తీరింది. ఆర్టీసీ ఆపీసు కొత్తగా మంజూరు చేసిన రూట్ల జాబితాలో బాలాజీ నగర్ను చేర్చారు. ఇక నుండి అయ్యప్ప దేవాలయం నుండి ఆత్మకూరు బస్టాండు మీదుగా బాలాజీ నగర్, ఎసి నగర్, మోడరన్ స్కూలు వరకు ఒక బస్సు నడుస్తుంది. నవాబ్ పేట వైపు వెళ్లే రూటులో కూడా మరో కొత్త బస్సు జత కలుస్తుంది. బస్సులు ప్రతిరోజూ వచ్చేలా బాధ్యత ప్రజలు తీసుకో గల్గితేనే బాలాజీ నగర్కు రోజూ బస్సులొస్తాయని చెప్పవచ్చు.



## ప్రకటన

కావలి తాలూకా సర్వాయపాళెం గ్రామకాపురస్తురాలు యర్రము రెడ్డి రుక్మిణమ్మ తనకు చెందిన మద్దూరుపాడు, సర్వాయపాళెం గ్రామములలోని భూములు యావత్తు 7-4-56 తేదిన వ్రాసి రిజిస్టరు చేసి యిచ్చిన సెటిల్‌మెంటు పత్రము మేరకు నాకు చెందవలసి యున్నది. ఆమె తన జీవిత కాలములో ఫలసాయము మాత్రమే అనుభవించు కోవలసినదే కాని విక్రయ వినిమయాదులు చేయకూడదు. అట్లు చేసివుండిన అవి చెల్లవు. సదరు ఆస్తులను సెటిల్‌మెంటు పత్రము మేరకు నేను స్వాధీన పరచుకొనుటలో ఎవరైనా అడ్డు వచ్చిన యెడల చట్టరీత్యా చర్య తీసుకొన బడునని ఇందుమూలముగా తెలియపరచడ మైనది.

ఇప్పగుంట విజితమ్మ
బుచ్చిరెడ్డిపాళెం.


**జమీన్‌రైతు**

సంవత్సర చందా రు. 100/-
6 నె లలకు- రు.50/-
విడిప్రతి - రు. 2.00




## కావలి ప్రిన్సిపల్ డి.ము. కోర్టులో

OP 4/93

పబ్బిశెట్టి బదరీ నారాయణ - పిటిషనరు

Nill - రెస్పాండెంటు

### నోటీసు

ఇందువల్ల యావన్మందికి తెలియ జేయునది ఏమనగా పై నంబరున పిటిషనరు మేనత్త పేరూరి నారాయణమ్మ చనిపోయినందున ఆమెకు వారసులుగా పిటిషను పెట్టి యున్నందున అందుకు ఎవరికయినా ఆక్షేపణలు వున్న యెడల అట్టివారు పై కోర్టుకు 8-10-93 తేది పగలు 10 గంటలకు హాజరయి మీకు గల ఆక్షేపణలు తెలుపు కోవలసినది. లేని యెడల మీ పరోక్షమందు తీర్మానించ బడును.

కె. సీతాభాగ్యలక్ష్మి
పిటిషనరు అడ్వొకేటు,
కనుమళ్ళవారి వీధి, కావలి- 524201

## In the Court of 1st Addl.Dist Judge, Kurnool.

MVOP 170/93

Subbara Rao - Petitioner

Vs

Siddaiah and others - Respondents

R2. K. Pulla Reddy
Father not known,
Lorry owner A.T.K. 4797
H No.5/87, Pappula Street,
Stone Housepeta, Nellore-2

### 2వ రెస్పాండెంటు నోటీసు

పై అర్జీలోని అర్జీదారుడు తనకు లారీ ప్రమాదములో తగిలిన తీవ్రమైన గాయ ములకు గాను నష్టపరిహారము కొరకు అర్జీ దాఖలు చేసియున్నాడు. 2వ రెస్పాండెంటు అయిన మీకు ఏలాంటి ఆక్షేపణలు వున్నయెడల పై కోర్టులో 6-10-93 తేదిన వుదయం 10-30 గం.లకు హాజరై తెలుపుకొన వలెను. లేని యెడల మీ పరోక్షమందు తీర్మానించబడును.

వాయిదా తేది 6-10-93

**S. Krishnudu**
Advocate for Petitioner
B/B, 403, B. Camp, Kurnool

# శ్రద్ధాంజలి



# టి. చంద్రశేఖర్ రెడ్డి, M.P

జూలై 13, 1931 - సెప్టెంబర్ 15, 1993

*మహనీయుల జీవితాలు మిగిల్చే స్మృతులు మన జీవిత పురోగతికి దారులు*
*ఆగిన శ్వాసలు మనకందరకు కాలరేణువుల పై అడుగుజాడలు*

## దశదిన కర్మ

25 తేది హైదరాబాదు, సోమాజిగూడలోని (నంబరు 6-3-898) చంద్రశేఖర రెడ్డి గారి స్వగృహంలో ఉత్తరక్రియలు జరుగుతాయి.

| | | | | |
|---|---|---|---|---|
| వితరణ శీలి | * | ధర్మపథకుడు | * | కర్మయోగి |
| దానకర్ణుడు | * | రాజనీతిజ్ఞుడు | * | మానవతావాది |
| ఒక వెలుగురేఖ | * | ఒక ఆశాకిరణం | | |

*ఆయన చూపిన ధర్మ మార్గం పై ఆయన వెలిగించిన దీపమే మాకు దిక్సూచి*

టి. రుక్మిణమ్మ (తల్లి)
టి. ఊర్మిళా రెడ్డి (భార్య)
టి. వెంకట్రామ్ రెడ్డి (కుమారుడు)
టి. వినాయకరవి రెడ్డి (కుమారుడు)

టి. రాజగోపాల్ రెడ్డి (సోదరుడు)
టి. సుబ్బరామిరెడ్డి (సోదరుడు)
జి. సులోచనా రెడ్డి (సోదరి)
జి. శ్రీనివాసులు రెడ్డి (బావగారు)

మరియు ఇతర కుటుంబ సభ్యులు

Edited, Printed and Published by N. Dolendra Prasad at Zaminryot Press. OFFSET Printing at Nayagara Paper Products (India) Ltd..